

Devotee of Puttaparti Sai Baba Dr. Panangipalli Venugopal with his roots in Rajamundry in Andhra Pradesh gave a new lease of life last week by his first successful operation transplant of heart

* * * * *

"According CHINESE PHILOSOPHY, from Confucius to Mao Zedong, many Sinologists would argue, has been one long treatise on the universality of contradictions. It is surprising that Indian thought, which has focussed even on existentialism and materialism, often assumed to be western concerns, has not produced the equivalent of say the Ying (the Chinese passive female principle) and Yang (the active male one) except in marginal strains of Kashmiri Shaivism."

# మిసిమి

***"All that we are is the product of what we have thought,' is "We are what we think." – Dammapada.***

సంపుటి 6 సెప్టెంబర్ 1994 సంచిక 62

సంపాదకుడు: రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 5/- వార్షిక చందా రూ. 60/-

### ముఖచిత్రం

సార్డానాపాలస్ స్వచ్ఛంద మరణం – 1827
(ప్రముఖ చిత్రకారుడు డిలాక్రాయిస్ వేసిన పెయింటింగు)

బైరన్ నాటకంలోని ఒక సన్నివేశపు చిత్రణ యిది. ఆ నాటకంలో నాయకుడు అసీరియన్ రాజు, సార్డానాపాలస్ కోటను శత్రువులు ముట్టడించగా అంతఃపురంలో చితి ఏర్పరచుకొని స్వచ్ఛంద మరణం వరిస్తాడు. ఆయనను గాఢంగా ప్రేమించిన ఆయన ఉంపుడుగత్తెలతోపాటు, తనకానందం కలిగించిన ఏ వ్యక్తీ, వస్తువు, అశ్వంతో సహా సర్వాన్ని చితిలోకి తోసి ఆనందించుచున్న కల్పనా చిత్రమిది.

# ప్రామిసరీ నోట్ల వేలం

1992 జూన్-జూలై ప్రాంతంలో 'సోవియట్' రుణం రష్యాకు ఇండియా చెల్లించాలా వద్దా అన్న అంశంపై భారతీయ పత్రికల్లో పెద్ద ఎత్తున చర్చ జరుగుతోంది. రూపాయి రూబుల్ వాణిజ్య కాలంలో భారతదేశం సరుకులను రష్యాకు ఎగుమతి చేసి ప్రత్యామ్నాయంగా ఆయుధాలను, మందుగుండు సామగ్రిని దిగుమతి చేసుకుంటూ ఉండేది. ఆ లావాదేవీలలో ఎగుమతుల మొత్తం పోగా కొంత బకాయి ఇండియా చెల్లించవలసి వుంది. 1978 ఒప్పందం నాటికి ఆ విధంగా ఇండియా రూ.40,000 కోట్ల మేరకు సోవియట్ యూనియన్‌కు బాకీ పడింది. అప్పటికి రూబుల్ విలువ 19.90 రూపాయలుగా లెక్కతేల్చారు. సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం అయిన తర్వాత రూబుల్ మారకం విలువ 5.5 రూపాయలకు పడిపోయింది. 1993లో రష్యా అధ్యక్షుడు బోరిస్ ఎల్సిన్ ఇండియాలో పర్యటనకు వచ్చినప్పుడు సోవియట్ యూనియన్‌కు బాకీ పడ్డ మొత్తాన్ని రష్యాకు చెల్లించాలని ప్రతిపాదించారు. రూబుల్ - రూపాయి మారకం విలువ నిర్ణయం కూడా జరిగింది. దాంతో ఇండియాకు రు.31,000 కోట్లకు తగ్గింది. ఈ మొత్తంలో 20 వేల కోట్లు 2010వ సంవత్సరం నాటికి, మిగిలిన 11వేల కోట్లు 45 సంవత్సరాలలోగా వడ్డీ లేకుండా చెల్లించాలని ఒప్పందం కుదిరింది. 31వేల కోట్లు విలువ చేసే భారతీయ ప్రామిసరీ నోట్లను రష్యాకు తీసుకొని వెళ్లారు. అంతర్జాతీయ మారకం రేట్ల దృష్ట్యా చూస్తే వాటి విలువ 110 కోట్లు మాత్రమే.

భారతదేశం ఆ ఒప్పందాన్ని ఎంత మాత్రం ఒప్పుకోకూడదని అప్పుడు పత్రికలన్నీ ఘోషించాయి. అయితే రష్యా నుంచి రక్షణ పరికరాల దిగుమతి అంశాన్ని దృష్టిలో ఉంచుకొని భారత ప్రభుత్వం ఒప్పందంపై సంతకం చేసింది. ఇండియా 'ఐఓయు'లను ఇండియా దిగుమతుల సందర్భంగా మాత్రమే వాడాలని అస్పష్టమైన హామీకూడా పొందింది. రూబుల్ విలువ 5.5 రూపాయలున్నప్పటి మాట అది. కాని దాని విలువ ఇప్పుడు 1.5 రూపాయలు మాత్రమే. ఇప్పుడు రష్యన్లు భారతీయ ప్రామిసరీ నోట్లను వేలం వెయ్యాలని నిర్ణయించారు. ఆ వేలంలో వాటి విలువ 20 నుంచి 30 శాతం వరకూ తగ్గిపోవచ్చు. అంటే 31000 కోట్ల విలువ చేసే భారతీయ పత్రాలు అంటే 10 బిలియన్ అమెరికన్ డాలర్లు విలువచేసే పత్రాలు 7 బిలియన్ డాలర్లకే లభ్యం అవ్వవచ్చు. వాటిని వేలంలో పొందినవారు వాటి గడువు పూర్తయ్యే లోగా ఆర్థిక లాభం పొందుతారు. నగదు విషయంలో రష్యా నకనకలాడుతోంది. కాబట్టే పాడేవారు తగ్గితే అవి కారు చవగ్గా దొరికినా దొరకవచ్చు.

ఇలాంటి పరిస్థితి అంతర్జాతీయ వాణిజ్యంలో ఎన్నడూ ఏర్పడలేద. 31000కోట్ల 'ఐఓయు'లపై సంతకం చేసి ఇండియా ఇప్పటికే తప్పు చేసింది. రక్షణ పరికరాల దిగుమతి ఎలాగూలేదు గావీ మన ప్రామిసరీ నోట్లు అంతర్జాతీయ వేలం పత్రాలుగా మారిపోయాయి. అప్పుడు తరణోపాయం ఆ వేలంలో మనం కూడా పాల్గొనడమే. వేలంలో పాల్గొని వీలైనంత తక్కువ రేటుకి వాటిని చేజిక్కించుకోవాలి. వాటి ధర పడగొట్టడానికి సామదాన దండోపాయ పద్ధతులకు తప్పులేదు. ప్రేమ, పోరూ రెండింటిలో ఏ పద్ధతి అనుసరించినా తప్పులేదని పెద్దలు చెప్పనే చెప్పారుగా?

('క్యాపిటల్ మార్కెట్' సౌజన్యంతో)

# కౌటిల్యుని విద్యాసముద్దేశాలు లోకాయత ఆకరాలు

- 'ఆరుద్ర'

(మిసిమి మే 1994 సంచికలో ''భారతీయ దర్శనాలు-పరిచయం'' అనే వ్యాసం, జూన్ నెల సంచికలో ''చార్వాక (లోకాయత దర్శనం)'' అనే వ్యాసం ప్రచురితమైనాయి. మొదటి దాంట్లో ఆన్వీక్షకి ప్రసక్తి కొంత కనబడుతుంది. కానీ తగినంత వివరణ లేదు. రెండవ వ్యాసంలో లోకాయత గురించి తెలియవస్తున్నన్ని భోగట్టాలలో కొన్నయినా లేవు. అందుకే ఈ వ్యాసం అవసరమైంది).

రాజ్య లాభ పాలనోపాయాలను ఉపదేశించే ప్రాచీన గ్రంథాలలో కౌటిల్యుని అర్థశాస్త్రం ప్రామాణికమైనది. రాజ్య పాలనకు నాలుగు విద్యలు అవసరమని కౌటిల్యుని మతం. అయితే అతని కన్నా పూర్వుడైన 'మనువు' తన అర్థశాస్త్రంలో మూడు విద్యలు కావాలని చెప్పాడు. బృహస్పతి అంతకంటే ముందు రెండు విద్యలను మాత్రమే పేర్కొన్నాడు. శుక్రుడు ఒకే ఒక్క విద్యను నిర్దేశించాడు. శుక్రునీ, బృహస్పతినీ కౌటిల్యుడు చాలా గౌరవిస్తాడు. వాస్తవానికి తన గ్రంథాదిని 'నమః శుక్ర బృహస్పతిభ్యామ్' అని ఉభయులకీ ప్రణామాల్ని అర్పించాడు. (మనువును వినుతించలేదు).

దండనీతి ఒక్కటే విద్య అన్నది శుక్రాచార్యుని మతమని కౌటిల్యుడు తన గ్రంథంలో చెప్పాడు (1.2.6) వార్తా, దండనీతి రెండే విద్యలని బృహస్పతి విశ్వాసం (11.2.4). మనువు ప్రకారం మువ్వేదాలూ, వార్త, దండనీతి, మూడూ ముఖ్యం. (1.2.2) లోకయాత్రా విదులు వేదత్రయాన్ని ఒక ముసుగు క్రింద మాత్రమే పరిగణిస్తారని కౌటిల్యుడు స్పష్టపరిచాడు. ''సంవరణ మాత్రం హి త్రయీ (1.2.5),'' తనను నాస్తికుని క్రింద జమకట్టకుండా ఉండటానికి ఈ సంవరణం సూత్రాన్ని కౌటిల్యుడు చెప్పాడని 'భాషా వ్యాఖ్యానం' తెలియచేస్తోంది. అయితే రాజ్యలాభ పాలనోపాయాలకు త్రయి చాలా అవసరమని గుర్తించిన వాడు కనుక కౌటిల్యుడు వేదాలను విద్యలలో చేర్చి త్రయీ స్థాపనను 17 సూత్రాలలో వివరించాడు. అయితే అతని సముద్దేశాలలో ఆన్వీక్షకి ప్రధానమైన విద్య. అందుకే ప్రథమ ప్రకరణంలో ''విద్యా సముద్దేశః తత్ర ఆన్వీక్షకీ స్థాపనా'' అంటూ ప్రప్రథమంగా ఆన్వీక్షకి ఆవశ్యకతను సంస్థాపన చేశాడు.

ఆన్వీక్షకి మతం హేతువాద ప్రధానమైనది. అది రాజనీతి పరులకు ధ్రువతారలా మార్గదర్శకం కాగలదు. కాబట్టి దానిని కౌటిల్యుడు ఇలా ప్రస్తుతించాడు.

ప్రదీపః సర్వ విద్యానా ముపాయః సర్వ కర్మణాం
ఆశ్రయః సర్వ ధర్మాణాం శశ్వదాన్వీక్షకీ మతా (1.2.12

ఆన్వీక్షకీ మతం సర్వ విద్యలకూ దీపం లాంటిది. సర్వకర్మలకూ ఉపాయం. సర్వధర్మాలకూ ఆశ్రయం అని సర్వదా భావిస్తారు. ఈ ఆన్వీక్షకీ మతం వల్లనే వేదాలలో ఏది ధర్మమో, ఏది అధర్మమో, వార్తలో ఏది అర్థమో, ఏది అనర్థమో, దండనీతిలో ఏది నయమో, ఏది అనయమో, విద్యలన్నింటిలో ఏవి గుణములో, ఏవి దోషాలో హేతువాదం చేత నిర్ణయించవచ్చు. అందుకే ఆన్వీక్షకి లోకానికి ఉపకారం చేస్తోంది. వ్యవసాయాభ్యుదయాల్లో బుద్ధికి ధైర్యం కలిగిస్తూ మనోవాక్కాయ కర్మలలో పటిష్ఠతను చేకూరుస్తుందని కౌటిల్యుడు చెప్పాడు. (1.2.11).

ఆన్వీక్షకీ మతంలో సాంఖ్యం, యోగం, లోకాయత అనే మూడు అంగాలు ఉన్నాయి. సాంఖ్యం ఆదిమ దర్శనం, యోగం ఆరోగ్య సాధనం. లోకాయత సాంఘిక వ్యవహార సరళి. ఆదిమ సాంఖ్య దర్శనం నిరీశ్వరం. ఇప్పుడు అది యథాతథంగా ఈనాడు మనకు లభ్యం కాదు. అది ఏ విధమైనదో ఊహించుకోవాలంటే దాన్ని ఖండించిన గ్రంథాల ద్వారా ఆకరాలు సేకరించాలి. వేదాంతులు సాంఖ్యాన్ని విపులంగా విమర్శించారు. ఆ పూర్వ పక్షాల నుండే సాంఖ్యం పూర్వ సూత్రాలను క్రోడీకరించవచ్చు.

బ్రహ్మసూత్రాలు సాంఖ్యాన్ని 'ప్రధానవాదం', ప్రధాన కారణవాదం అని పేర్కొంటాయి. సాంఖ్యంలో 'ప్రధానం' అన్న మాట ప్రకృతికి పర్యాయపదం. సాంఖ్యులు ప్రధానమే జగత్కారణం అంటారు. ప్రధానం అచేతనమైనది. అయినా అది సత్వ రజస్తమో గుణ రూపిణి కనుక జగత్తుకు ఉపాదాన కారణమైంది. సాంఖ్యం వేద ప్రమాణాన్ని అంగీకరించదు. వేదాంతుల బ్రహ్మవాదాన్ని లేక బ్రహ్మ ప్రధానవాదాన్ని తోసిరాజంటుంది. సాంఖ్యంలో ప్రకృతి మూల ప్రధానమైతే పురుషుడు అప్రధానుడు. పైగా సాంఖ్యంలో పురుష బహుత్వం ఉంది. ప్రకృతి ధర్మాలను గుర్తించినప్పుడే మానవులు ప్రకృతిని జయించటం సాధ్యమవుతుందని సాంఖ్యం తెలియచేస్తుంది. ప్రకృతిని జయించటానికి యోగం ఒక సాధనం.

బయట వున్న స్థూల జగత్తులాగే మానవ శరీరంలో ఒక సూక్ష్మ జగత్తు ఉంటుందనీ, యోగాచారం ద్వారా శరీరాన్ని స్వాధీనంలో ఉంచుకుని సిద్ధులను పొందవచ్చుననే విశ్వాసం వల్ల అష్టాంగ యోగం రూపొందింది. 1) యమము 2) నియమము 3) ఆసనము 4) ప్రాణాయామము 5) ప్రత్యాహారము 6) ధారణము 7) ధ్యానము 8) సమాధి - అనే ఎనిమిది యోగంలోని అంగాలు. వీటిలోని ఆసనాలు రోగనివారణకు అవసరం. 'ఆసనేన రజోహంతి' అంటారు. ఆసనాలు అభ్యసించటం వల్ల రజోగుణం నశిస్తుంది. ప్రాణాయామం వల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసాల గమనాగమనాలను నిరోధం చేయగలగటం సాధ్యమవుతోంది. ప్రత్యాహారం వల్ల విషయములతో సంచరించే ఇంద్రియాలను బలాత్కారంగా మరలించి కోరిన విషయాలలో ప్రవేశపెట్టవచ్చు. ఇందువల్ల కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలు సాధకుల స్వాధీనంలో ఉంటాయి. ధారణకు ఇది అవసరం. ధారణ వల్ల మనోధైర్యం కలుగుతుంది. ధ్యానం వల్ల చైతన్యం ఉద్బుద్ధమవుతుంది. సమాధి వల్ల మనసును వశపరుచుకోవచ్చు. యోగంలోని ఆరు అంగాలను పాటించటానికి సాధకులకు యమ నియమాలు ముఖ్యం.

ఆదిమ సమాజాల్లో ప్రకృతిని జయించదలుచుకున్నవారికి మనోధైర్యం ముఖ్యం. అది యోగం వల్ల సాధ్యమవుతుంది. జాతి అవసరాలకు కావలసిన వాటిని ఉత్పత్తి చేసుకుని సుఖజీవనం గడపటమే ఆదిమ సమాజంలో మానవుల ధ్యేయం. ప్రకృతి ధర్మాలను అర్థం

చేసుకోటానికి హేతువాదం కావాలి. తార్కికదృష్టి, తార్కిక చింతన అవసరం. దీనిని లోకాయత విధానం సాధించింది.

లోకాయతులను బార్హస్పత్యులంటారు. ''(లోకాయతం బార్హస్పత్యం లోకాయత బుద్ధిం తనోతి ఇతి నైరుక్తం)'' అని జయ మంగళ చాణక్య టీకలు చెప్పినట్లు పరిశోధకులు విశదపరిచారు. బృహస్పతి మతం ప్రకారం వార్త, దండనీతి అనేవి రెండూ విద్యలు. ''వార్తా దండనీతిశ్చేతి బార్హస్పత్యాః'' (1-2-4) అని కౌటిల్యసూత్రం. ''కృషి పశు పాల్యే వణిజ్యాచ వార్తా'' అని నిర్వచనం (1-4-1) ఈ సూత్రంలోనే ''ధాన్య, పశు, హిరణ్య, కుప్య వేష్టి ప్రధానాదోప కారికీ'' అని వివరణ. వార్త సాధనం వల్ల పశువులు, బంగారం, వన్య పదార్థాలు, వెట్టికూలీలు లభిస్తారు. రాజ్యపాలనకు అర్థం ముఖ్యం. అందుకనే బార్హస్పత్యుడిలా కౌటిల్యుడు దానికే పెద్ద పీట వేశాడు. 'అర్థ ఏవ ప్రధాన ఇతి కౌటిల్యః' (1.7.6) అని తన మతంలో అర్థమే ప్రధామని చెప్పడమే కాక 'అర్థమూలౌ హిధిధర్మ కామావితి' (1.7.7) అని ధర్మకామాలు రెండింటికీ అర్థమే మూలమన్నాడు. అర్థం అంటే చిట్టచివరి అధికరణంలో మొట్టమొదట ఇలా వివరించాడు. 'మనుష్యాణాం వృత్తి రర్థః మనుష్యవతీ భూమి రిత్యర్థః' (15-1-1) మనుష్యుల జీవనోపాధికి మూలము అర్థం లేదా మనుష్యులతో కూడిన భూమియే అని చెప్పాడు. లోకాయతుల సిద్ధాంతాలకు కూడా ఆర్థిక విధానమే ప్రాతిపదిక. వాళ్లకు వేదం ప్రామాణ్యం కాదు. కౌటిల్యుడు వేదాలను కూడా అంగీకరిస్తాడు కనుక ధర్మం అవసరమే అంటాడు. అయితే ఏది ధర్మం, ఏది అధర్మం అన్న ప్రశ్నే వస్తే ఆర్థిక విధానాల వల్ల ధర్మాధర్మ నిర్ణయం జరుగుతుందని ధ్వనిస్తాడు. లోకాయతులు ధర్మాన్ని పూర్తిగా నిరాకరిస్తారు. వారికి అర్థకామాలే ముఖ్యం.

కౌటిల్యుడు అర్థశాస్త్రాన్ని రచిస్తున్నాడు కనుక లోకాయత సిద్ధాంతాలను ఉదాహరించ లేదు. అలా చేసినవాడు ఆదిలో వాత్స్యాయనుడే- కామశాస్త్ర రచన అనవసరమనే వారి వాదాలూ, వాటిలోని యుక్తులూ చూపెట్టి వారి ఆక్షేపణలకు సమాధానాలు చెప్పాడు. ఆదిలో సాధారణాధికరణంలోనే నాస్తిక దర్శనాల్లో చెప్పే కారణాలను పేర్కొన్నాడు. లోకాయత సిద్ధాంతాలను వివరించే ఆరు సూత్రాలను ఉదాహరించి వాటిని విశదీకరించాడు.

**1. నధర్మాంశ్చరేత్ (1.2.25)**

ధర్మాలను ఆచరించకూడదు. వాత్స్యాయనుడు గ్రంథాదినే 'ధర్మార్థ కామేభ్యోనమః' అని ధర్మం కొరకూ, అర్థం కొరకూ, కామం కొరకూ నమస్కరిస్తున్నాను... అని చెప్పాడు. తాను పూజించే ధర్మాన్ని లోకాయతులు అంగీకరించరు. అందుకే వారి మతంలోని ధర్మాలను ఆచరించకూడదనే సూత్రాన్ని మొదట చెప్పాడు.

**2. ఏష్యత్ఫలత్వాత్ (1-2-26)**

ధర్మాలను ఎందుకు ఆచరించకూడదంటే అవి ఏష్యత్ఫలం కలవి కనుక. అంటే వాటి ఫలం ఇప్పుడు కాక ఎప్పుడో సిద్ధించేది. యజ్ఞయాగాల వంటి ధర్మసాధక కార్యాలు ఇహానికి సంబంధించినవి కావు. ఈ జన్మలో ఫలితమిచ్చేవి కాక జన్మాంతరంలో ఫలమిచ్చేవి కనుక ధర్మాలను ఆచరించటం నిరుపయోగం. ఎంత తెలివి తక్కువవాడైనా ఇహలోకంలో ఫలవంతమైన సేద్యం మొదలైన వాటినే చేపట్టి ఫలం అనుభవిస్తాడు గాని పరలోకాన్ని ఆశించడని వ్యాఖ్యానం. ధర్మం అంటే యజ్ఞయాగాదులని అర్థం.

3. సాంశయిత్వాచ్చ (1-2-27)

కష్టపడి ఎలాగో యజ్ఞయాగాదులు చేసినా స్వర్గఫలం వస్తుందో రాదో నిశ్చయంగా చెప్పలేం. అసలున్నవో లేవో కూడా సాక్ష్యాధారాలు లేవు. సందేహాస్పదమైన పనికి ఎవడూ డబ్బు ముడిపెట్టడు. అందుచేత ధర్మాలు ఆచరించకూడదు.

4. వర మద్య కపోతః శ్వో మయూరాత్ (1-2-29)

రేపటి నెమలి కన్నా నేటి పావురమే దొడ్డది. చచ్చిపోయాక ఒకవేళ దొరికే స్వర్గంకన్నా ఇప్పుడు బతికున్న భూలోకమే శ్రేష్ఠం. పక్షులను వేటాడి చంపి మాంసం తిందామనుకునే వాడికి ముందెప్పుడో దొరకబోయే నెమలి కన్నా ఇవాళ చిక్కే పావురమే గొప్పదని లోకులు భావిస్తారు కదా!

5. వరం సాంశయికాన్నిష్కా దసాంశయికః కార్షాపణ ఇతి లోకాయతికాః (1-2-30)

వస్తుందో రాదో తెలియని బంగారు నాణెం కన్నాం కచ్చితంగా లభించే అల్పనాణెం నయం. 'ఇవాళ నా దగ్గర రూపాయిపావలా మాత్రమే ఉంది. రేపు మాత్రం నాకు నూరు సవరన్లు వస్తాయి. అప్పుడో సవరను నీకిస్తాను' అని ఎవడైనా అంటే నిక్కచ్చిగా తెలియని నిష్కం కన్నా అనుమానానికి తావులేని కార్షాపణాన్నే మిన్నగా లోకులు భావిస్తారు. ఇవి లోకాయతికుల మాటలు.

వాత్స్యాయన కామసూత్రాలకు యశోధరుడు వ్యాఖ్యానం రాశాడు. దీనిని జయ మంగళ టీక అంటారు. లోక ప్రసిద్ధి గల దృష్టాంతాలనే లోకాయతులు చూపించారని యశోధరుడు తన వ్యాఖ్యానంలో అడుగడుగునా విశదపరిచాడు. లోకాయతులను స్పష్టంగా ఆ పేరుతో వాత్స్యాయనుడు పేర్కొన్నా మనువు మాత్రం అలా చేయలేదు. లోక యాత్రా విదులను చాలా పేర్లతో పిలిచాడు.

పాషండినో వికర్మస్థాన్ బైడాల వ్రతికాచ్ఛఠాన్
హైతుకాన్ బక వృత్తింశ్చ వాఙ్మా త్రేణాపి నార్చయేత్
(మను-4-30)

మనువు దృష్టిలో హేతువాదులు పాషండులు. వికర్మష్ఠులు. బిడాల వ్రతికులు. శఠులు. బక వృత్తిగలవాళ్లు. వీళ్లను మాటవరసకైనా గౌరవించకూడదు. మనుస్మృతి రచనాకాలం క్రీ.పూ. 1200 నుండి క్రీ.శ. 150 వరకూ ఉన్న మధ్యకాలం అని వివిధ విమర్శకులు భావిస్తున్నారు. 'మోనియర్ విలియమ్స్' క్రీ.పూ. 5వ శతాబ్దమన్నాడు. కాణే పండితులు క్రీ.పూ. 3వ శతాబ్ది అన్నారు. వివిధ ధర్మశాస్త్రాలపై సాధికారమైన విమర్శాత్మక వివరణలు రాసిన కాణే పండితుల నిర్ణయానికి చాలా విలువ ఉంది. క్రీ.పూ. 3వ శతాబ్దికి హేతువాదులు సుప్రసిద్ధులయ్యారని చెప్పవచ్చు.

మనుస్మృతికి వ్యాఖ్యానం వ్రాసిన కుల్లూక భట్టూ, మేధాతిథీ 'హైతికులు నాస్తికులైన లోకాయతికులే' అని చెప్పారు.

'హేతుశాస్త్రాన్ని ఆశ్రయించే నాస్తికులు వేదనిందకులు' అని మనువే అంతకు ముందు చెప్పాడు.

యో2వ మన్యేత్ తే మూలే హేతుశాస్త్రాశ్రయో ద్విజః
ససాధుభి ర్బ హిష్కార్యో నాస్తికో వేద నిందకాః
(మను-2-11)

'లోకేషు ఆయతః లోకాయతః' అనే వ్యుత్పత్తిని కాక 'లోకే ఆయతంత ఇతి లోకాయతాః' లోకమందరి వారిని యుక్తుల ద్వారా వశపరుచుకొనుటకు ప్రయత్నించు శాస్త్రములు కనుక లోకాయతములు అనే వ్యుత్పత్తిని చెప్పి లోకాయతులు చార్వాక మతానుయాయులనే దార్శనిక వచనాలను ఉటంకించారు. చార్వాకుడు చాలా ప్రాచీనుడు. వాల్మీకి రామాయణంలో జాబాలి చెప్పిన మాటలు లోకాయత మతానివే. వాల్మీకి జాబాలిని బ్రాహ్మణోత్తముడని చెప్పాడు. (అయోధ్య-108-1)

జాబాలిది చార్వాక మతమని వ్యాఖ్యాతలు విశదీకరించారు. వ్యాసభారతంలో చార్వాకుడు ఒక చిన్న పాత్ర. శాంతి పర్వంలో హస్తినాపురానికి తిరిగివస్తున్న ధర్మరాజును నిలబెట్టి పచ్చనిలోకాన్ని పీనుగు పెంటలతో నింపి నువ్వేం బావుకుంటావని నిందిస్తాడు. (38, 39 అధ్యాయాలు). ఈ చార్వాకుడు బ్రాహ్మణ వేషం వేసుకున్న రాక్షసుడనీ దుర్యోధన సఖుడని అక్కడ వున్న బ్రాహ్మణులే అతడ్ని అప్పటికప్పుడు చంపేస్తారు.

జాబాలి బ్రాహ్మణుడే. చార్వాకుడూ బ్రాహ్మణుడే. ఈ ఇద్దరూ ఆర్షధర్మాన్ని ఎందుకు వ్యతిరేకించారు? వేదాన్ని ఎందుకు తోసిపుచ్చారు? యజ్ఞయాగాదులూ, ఆబ్దీకాలూ, మొదలైనవి ఎందుకు నిరసించారు? చార్వాకుడ్ని బ్రాహ్మణ వేషం వేసుకున్న రాక్షసునిగా ఎందుకు చిత్రించారు? ఆర్యులు రాకముందు మన దేశంలో ఒక విలక్షణమైన నాగరికత వుండేది. దాన్ని ఆర్యులు ధ్వంసం చేశారు. అనార్యులను దస్యులన్నారు. కృష్ణత్వక్కులూ, శిశ్న దేవులూ అని ఈసడించారు. కొన్నాళ్లు పోయాక దేశంలో ఉన్న అనార్యులందర్ని చంపటం సాధ్యంకాదు కనుక ఆర్యులు కొంతమంది అనార్యులతో స్నేహం చేశారు. ఇలాంటి అనార్యులలో నిషాదులు పేర్కొనతగ్గవాళ్లు. కొన్ని యజ్ఞయాగాల్లో నిషాదులను ఆర్యులు పాల్గొననిచ్చారు. వాళ్లకు బ్రాహ్మణత్వాన్ని కూడా కొన్ని సందర్భాల్లో అంగీకరించారు. బ్రాహ్మణులలో నిషాదగోత్రం కూడా ఒకటుంది. వాస్తవానికి స్మృతికర్తల లెక్కప్రకారం పది రకాల బ్రాహ్మణులు ఉన్నారు.

దేవ ముని ర్ద్విజో రాజా వైశ్య శూద్ర బిడాలకః
పశు మ్లేచ్ఛ శ్చండాలో దశ విప్రా ప్రకీర్తితాః

ఈ అంచనా ప్రకారం దశ విధ బ్రాహ్మణుల విభాగాలు ఇవి: 1) దేవ బ్రాహ్మణులు 2) ముని బ్రాహ్మణులు 3) ద్విజ బ్రాహ్మణులు 4) క్షత్రియ బ్రాహ్మణులు 5) వైశ్య బ్రాహ్మణులు 6) శూద్ర బ్రాహ్మణులు 7) బిడాలక బ్రాహ్మణులు 8) పశు బ్రాహ్మణులు 9) మ్లేచ్ఛ బ్రాహ్మణులు 10) చండాల బ్రాహ్మణులు.

ఒక్కొక్క జాతివాళ్లు వాళ్ల వాళ్ల కులాచారాలను బట్టి వివిధ జీవిత సంస్కారాలను చేసుకోవాలి. అవి చేయించే కుల పెద్దలనే ఆ జాతి బ్రాహ్మణులుగా అంగీకరించక తప్పలేదు. ఈ దశ విధ బ్రాహ్మణులలో బిడాలక బ్రాహ్మణులు ఉండటం గమనించదగ్గ విషయం. హైతికులను మనువు బిడాల వృత్తిగలవాళ్లని పేర్కొన్నాడు.

యత్ర కుత్ర ప్రతిగ్రాహీ నిత్యం భ్రమణ తత్పరః
స్వకార్య ముద్దిశ్య సదా స బిడాల ఉచ్యతే

స్వకార్యం కోసం నిత్యం సంచరించే వారు బిడాల ప్రవృత్తి గలవాళ్ళు. దురాన్న దుర్ధానాదులు ఎక్కడెక్కడ సంప్రాప్తమౌతాయో అన్న దృష్టితోనే నిత్యం వీళ్లు భ్రమణతత్పరులు అవుతారని పురోహిత వర్గాల వ్యాఖ్యాతలు చెప్తారు గాని, బిడాల బ్రాహ్మణులు ఆహార సేకరణ దశలోని వేటగాళ్లు. వీళ్లనే నిషాద బ్రాహ్మణులని కూడా అంటారు. చార్వాకం వీరి వల్ల వ్యాపించింది.

ఆర్యులతో సంపర్కమున్నా నిషాద బ్రాహ్మణులు తమ ప్రాచీన మతాన్నీ, భౌతికవాదాన్నీ, జీవయాత్రా విధానాన్నీ విసర్జించలేదు. నిషాదులు చేపలు పట్టటం, వేటాడటం, పడవలు నడపటం మొదలైనవి చేస్తూ జీవించేవాళ్లు. అందుకే చార్వాక దర్శనంలో కొన్ని ఉపమానాలు, ఉదాహరణలు పక్షుల వేటకూ, చేపలకూ సంబంధించినవి కావడం గమనించ తగ్గ విషయం. అవి వారి అర్థసాధన విధానాలు. అర్థసాధన విషయంలో అందరూ లోకాయతులేనని బృహస్పతి చెప్పాడు. గణవ్యవస్థ నుంచి రాచరికానికి సంఘం పరివర్తన చెందినప్పుడు కూడా లోకులు తమ మతాన్నీ, వార్త ప్రాధాన్యాన్నీ మరిచిపోలేదు. ఎకానమీ లేకపోతే రాజా ఉండడు, రాజ్యమూ ఉండదు. లోకాయతులు అరాజకవాదులు కారు. కొన్ని నియమాలకు కట్టుబడిన సామాజిక వ్యవస్థలో కులానికి, గ్రామానికి, నాడుకీ, దేశానికీ ఒక పెద్ద అవసరం. 'లోక సిద్ధో భవే ద్రాజా పరేశో నా పరః స్మృతః' అని చార్వాక మతం చెప్తుంది. ''లోకసిద్ధ రాజు శాసనమే ఈశ్వర శాసనముగా తలచి దానిని పాటింపవలెనని తత్తత్కాల దేశములందు ప్రచారమందున్న న్యాయ విధులను పాటించుటే ధర్మమని (లోకాయతుల) అభిమతము. రాజు లేదా శాసనకర్త నిర్మించు విధులే ధర్మము. అవి అపౌరుషేయములో, నిత్యములో కావు. ఇట్లు రాజనియమబద్ధమగు సౌఖ్యమును అర్థకామములను సాధింపుమని లోకాయతం బోధించినది'' అని దార్శనిక చరిత్రకారులు రాశారు. (తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వం ఏడవ సంపుటం పుట 72).

ఉత్తర భారతదేశంలో ప్రాచుర్యం పొందిన లోకాయతం దక్షిణాదికి బహుశా ముక్కంటి కాడు వెట్టి త్రిలోచన పల్లవుడు అనే పేరుతో సుప్రసిద్ధుడైన నందివర్మ (క్రీ.శ. 485-510) పాలనలో వచ్చినదని ఊహించవచ్చు. అనాడు అతడు శ్రీశైల పర్వతం ఆగ్నేయదిశలోని అడవులను కొట్టించి, అగ్రహారాలను కట్టించినపుడు అతని విరోధి కరికాళచోళుడు ఆర్యావర్తం నుండి విద్వాంసులను పిలిపించి అగ్రహారాలను భూములనూ ఇచ్చినప్పుడు లోకాయత కూడా వ్యాప్తి చెందింది. షడ్దర్శనాల్లో ఆస్తికాలనూ, నాస్తికాలనూ సమానంగానే తొలిరోజుల్లో ఆదరించేవారు. మధ్యయుగాల్లో లోకాయతకు కన్నడదేశంలో ఎక్కువ ఆదరణ ఆశ్రయం లభించాయి. లోకాయతం కూడా ఒక ప్రాచీనశాస్త్రం కాబట్టి అది అంతరించకూడదనే సదుద్దేశంతోనే దాన్ని అధ్యయనం చేసే కుటుంబాలకు రాజులు అగ్రహారాలు ఇచ్చారు. ఒకటి కాదు, రెండు కాదు. అయిదు గ్రామాల్లో లోకాయత విద్యాకేంద్రాలు విలసిల్లాయి. వాటి వివరాలు ఇవి:

1. గుండేరి-చిత్రదుర్గం జిల్లా, హూళర్ కెర తాలూకా, 2) బేగూర్-షిమోగా జిల్లా, సీకాల్ పుర తాలూకా, 3)బళ్లిగామ్ వె-షిమోగా జిల్లా, సికార్‌పుర తాలూకా, 4) సోమనాధపుర-కావేరి తీరాన ఉంది. 5) నాగరఖండ- షిమోగా జిల్లా.

క్రీ.శ 968 నుండి లోకాయతులకు సంబంధించిన శాసనాలు కన్నడ దేశంలో కనబడతాయి. ఎందరో రాజపోషకులు, మహారాజ పోషకులు ఈ విద్యలను నిలబెట్టటానికి అగ్రహారాలు ఇచ్చారు. క్రీ.శ. 10వ శతాబ్దం నుంచి 15వ శతాబ్దం దాకా లోకాయతులు కర్నాటకలో చాలా శక్తిమంతంగా ఉన్నారని ఇతర దార్శనికులతో కలబడి చాలా గట్టిగా వాదించేవారనీ పరిశోధకులు నిరూపించారు. (Historical notices of Lokayatas by B.A. SALETORE, Bhandarkar Oriental Research Institute Vol. 23 1942.) తన కాలం నాడు లోకాయతం ప్రముఖ దర్శనం కాబట్టి మాధవ విద్యారణ్యులు తమ సర్వదర్శన సంగ్రహంలో దానిని విపులంగా వివరించాల్సిన అవసరం ఏర్పడింది. ఈ గ్రంథం అనన్య ప్రచారం పొందింది. మాధవ విద్యారణ్యులు 1375లో శృంగేరీ పీఠాధిపతులయ్యారు. వారి గురువులు భారతీ తీర్థులు. భాట్ట, బౌద్ధ, క్షపణక, చార్వాకాది దర్శనాలను ఓడించి అద్వైతానికి విజయం చేకూర్చారని శాసన ప్రమాణాలు ఉన్నాయి. భారతీతీర్థుల సన్నిధిలోనే మాధవ విద్యారణ్యులు సర్వదర్శన జ్ఞానాన్ని పొందారు.

కన్నడ దేశంలో తెలుగు సాహిత్యంలో కూడా చార్వాకాది మతాల భోగిట్టాలు లభిస్తున్నాయి. వీటిని నా ''మన వేమన'' అనే గ్రంథంలోని 'లోకులు', 'లోకాయతులు' అనే ప్రకరణంలో వివరించాను.

(శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి ప్రచురణ, 1985).

JNANPITH AWARDEE
PADMABHUSHAN.
**PROF. C. NARAYANA REDDY** M.A., Ph D.,D Litt
ADVISER TO GOVERNMENT CULTURE AND LANGUAGE

మిత్రులు శ్రీ రవీంద్రనాథ్ గారికి- నమస్కారాలు.

'మిసిమి' ప్రత్యేక సంచిక అందింది. అయిదు సంవత్సరాలు అప్పుడే పూర్తయ్యాయా? ఆశ్చర్యం వేసింది. ప్రతి సంచికా చదువుతూ వున్నాను. విజ్ఞాన వికాసం చరమలక్ష్యంగా నడుస్తున్న పత్రిక ఇది. ఏ పత్రికలోనూ (మాస, వార, దిన) రాని విలక్షణ రచనల్ని ప్రచురించారు. పునర్ముద్రణలు కూడా రాబోయే (సరికొత్త) రచనలకు ప్రేరకంగా వున్నాయి. కాలాన్ని జయించిన మౌలికధాతువులున్న రచనలివి. అయిదేళ్ల కాలం ఎలా చప్పున ఎగిసిపోయిందో? ఔను. ఈడుస్తూ సాగే పత్రికలు చదివితే ముసలి అడుగులు గుర్తుకొస్తాయి. 'మిసిమి' అడుగుల్ని రెక్కలుగా చేసుకుని ఎగిసే పత్రిక, అందుకే కాలం అంత వడిగా పరుగెత్తింది.

మీకు గుర్తుందోలేదో, ఒకటి రెండుసార్లు 'మిసిమి' చాలాబాగా వస్తున్నదనీ, రాగానే చదివేస్తున్నాననీ మీకు ఫోన్‌లో తెలిపాను. లేఖలు రాయాలంటే చికాకు. కారణం? నా ఆలోచనలకూ, శబ్దధారకూ రాత నిలవదు. వోణికి పోతుంటుంది. అయినా ఉండలేక రాశాను నా చేత్తోనే. చాలా సంతోషం. చెక్కు రూపంలో పంపుతున్న ఓ సంవత్సరం చందా అందుకోండి.

మీ
సినారె

# కన్యాశుల్కం-పాత్రల పేర్లు

- వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

మహాకవి గురజాడ కన్యాశుల్కం నాటకాన్ని ఎన్నో విషయాల్లో వేలెత్తి చూపడానికైనా వీలులేని విధంగా రచించేరు. కాని కొన్ని పాత్రల పేర్లను సాభిప్రాయంగా రూపొందించడానికై కొంతలోకొంతైనా పాతపుంతల్ని తొక్కి కొంత వెలితిపడ్డారనక తప్పదు.

పాత్రల గుణగణాల్ని దృష్టిలో ఉంచుకొని వాటికి సార్థక నామకరణాలు చేయటం వాస్తవికతా విరుద్ధమేగాక మహాకవులకు తగనిపని.

ఈ తగని పని పురుష పాత్రల విషయంలో మరింత ఎబ్బెట్టుగా ఉంటుంది. సమాజంలో స్త్రీలకు కొన్నికొన్ని వర్గాల వాళ్ళు ఆలోచనాత్మక నామకరణాలు చేయటం ఎంతోకాలం నుంచీ రివాజులో ఉంది. కాబట్టి పేర్లలో కూడా నాగరికత మేలిముసుగును వేసుకొన్న స్త్రీ పాత్రల పేర్లు పురుష పాత్రల కృతక నామాలంత అసహజంగా ఎబ్బెట్టుగా లేవనుకోవచ్చు. ఉదాహరణకు అనసూయ, ప్రియంవద, సుగాత్రి, కలభాషిణి, మధురవాణి వంటి స్త్రీ పాత్రల పేర్లు చెకుముకిశాస్త్రి, జంఘాలశాస్త్రి, పేరిగాడు, గంధోళీగాడు, సాక్షి, ప్రవరుడు, లుబ్ధావధాన్లు వంటి పురుష పాత్రల పేర్లలాగా అంత ఎబ్బెట్టుగా లేవని మనం సర్దుకుపోవచ్చు. కాని ఆ కృతక స్త్రీ నామాలకు ముర, గొడగూచి, ముసలమ్మ, వెంకమ్మ, బుచ్చమ్మ వంటి ఆడపేర్లకున్న నిండు వాస్తవికత ఎలా వస్తుంది!

సార్థక నామకరణం పొందిన పాత్రల మధ్యకు మానసికంగా పోయిన పాఠకులుగాని ప్రేక్షకులుగాని ఏ దేవరాక్షసగణాల మధ్యనో ఏ కాల్పనిక కుహనావ్యక్తుల మధ్యనో తాము న్నట్లు అనుభూతిని పొందుతారే తప్ప అచ్చమైన జనం మధ్య తామున్నప్పటి స్వచ్ఛానుభూతిని పొందలేరు!

ఆధునికాంధ్ర సాహితీ మార్గాల్లో-అందునా నాటక వీథుల్లో-తనదైన అడుగుజాడను ప్రగాఢంగా ముద్రించుకోగల్గిన గురజాడ పాత్రల పేర్ల పరికల్పనకై కొంతగా పాతపుంతలో కాలుపెట్టడం చింతించాల్సిన విషయమే!

కన్యాశుల్కంలోని పాత్రలకు పేర్లు పెట్టడంలో గురజాడ నాలుగు విధానాల ప్రణాళికను రూపొందించుకొన్నట్లు రూఢి అవుతోంది!

1. సమకాలీన సమాజంలో తారసిల్లిన వ్యక్తుల వింత వింత పేర్లను సేకరించి వాటిని తన నాటక పాత్రలకు పెట్టడం:-

మనవాళ్ళయ్య, అసిరిగాడు, పోలిసెట్టి, గవరయ్య, బుచ్చన్న, సోమినాయుడు, అచ్చన్న, లచ్చన్న, దిబ్బావధాన్లు, అక్కాబత్తులు, వీరేశ, సుబ్బి.

ఇంతటి విశుద్ధ మాండలిక నామాలకు సాహితీ చిరస్థాయిత్వ గౌరవాన్ని పరికల్పించిన తొలి తెలుగు కవులుగా ప్రాచీనుల్లో పాల్కురికి సోమన్నా, శ్రీనాథుడూ నిలిచివున్నా, ఆధునిక యుగంలో ఆద్యులు గురజాడవారే!

2. తన నాటక కథా వస్తువుకు పట్టుకొమ్మలైన ఉన్నత వర్గాలలో విశేషించి బ్రాహ్మణుల్లో పరిపాటిగా ఉండే పేర్లతో నాటక పాత్రలకు నామకరణం చేయడం:-.

వెంకమ్మ, బుచ్చమ్మ, సుబ్బమ్మ, మీనాక్షి, వెంకటేశం, ఎన్. గిరీశం, కొండుభట్లు, రామప్పంతులు, లింగన్నగారి కాంపోట్లు, మహేశం, భీమారావు పంతులు, వెంకట్రావు పంతులు, బుచ్చిబ్బి, రామదాసు.

వీటిలో కొన్ని చక్కని తేటతెనుగు పేర్లు, మరికొన్ని తత్సమ తద్భవాలూను. ఇవన్నీ నేటికీ జనం రోజువారీ రివాజులో మనకు వినబడడం గమనార్హం!

3. పాత్రలకు పేర్లంటూ వేరే పెట్టక ఉత్తి వృత్తి బోధక పదాలనే వాడడం:-

హెడ్ కనిస్టీబు, డిప్టీ కలక్టరు, డిప్టీ కలక్టరుగారి కొడుకు, పూటకూళ్ళమ్మ, గ్రామ మునసబు, బుగత, సిద్ధాంతి, దుకాణదారు, యోగిని, హవల్దారు, బైరాగి, సాతాని, జంగం.

వీరిలో ఇద్దరు ముగ్గురిని పేర్లతో బాటు కలగలిపి అనడం కూడా కద్దు.

4. పాత్రల మనోధర్మాలకు అనుగుణంగా సార్థక నామకరణాలు చేయడం:-

గురజాడలోని ఈ గుణాన్నీ, అన్ని పాత్రల పేర్లకూ ఇంటిపేర్లు తగిలించకపోవడాన్నీ శ్రీ.శ్రీ. ఇష్టపడక; చిలకమర్తి వారిలాగా ఇంటిపేర్లతో పాత్రల్ని పేర్కొనడం ఈనాటిదాకా ఏ నాటకకర్తా చేయడంలేదని వాపోయేరు!

ఈ నాలుగో విధానానికి చెందిన అయిదు పేర్ల పుట్టుపూర్వోత్తరాలను చర్చిద్దాం :

**1.** కరటక శాస్త్రి: ఈ పదానికి ద్విధా రూపసాధన చేయాలి. 'కరట' అనే పదానికి స్వల్పార్థంలో 'క' ప్రత్యయం చేరిస్తే 'కరటక' అనే రూపం సిద్ధిస్తుంది. లేదా 'కరటక' అనేదే మూలపదం అని కూడా అనుకోవచ్చు. రెండూ సమానార్థకాలే. పర్యాయపదాలుగా ఉన్న వీటికి తొమ్మిది నానార్థాల్ని నిఘంటుకారులు చూపేరు. ప్రస్తుతానికి మనకు నాలుగు అర్థాలు మాత్రమే వర్తిస్తాయి.

ముందుగా- కాకి, గోదురుకప్ప, నింద్య జీవనం అనే మూడర్థాల్నీ అన్వయించుకొంటూ ఈ పాత్రకీ పేరుపెట్టడంలో గురజాడకు గల ఇంగితాన్ని గ్రహింప ప్రయత్నిద్దాం

వృత్తిరీత్యా విదూషక పాత్రధారి కావడం వల్ల ఈ పాత్ర నాటక ప్రదర్శనల కోసమని ఎప్పుడూ ఇంటిపట్టున ఉండక, ఊరూరా తిరుగుతూనే ఉంటాడు. తప్పితే విజయనగరంలో మకాం. అదీ సాగకపోతే బావ ఇంట్లోనే తిష్ఠ. అంచేత కాకిలా ఇల్లిల్లూ తిరిగి పొట్ట గడుపుకొనేవాడు అనవచ్చు.

పుట్టుకతో అబ్బిన కావ్య నాటకశాస్త్ర పాండిత్యం; వృత్తిరీత్యా విదూషక పాత్ర ధారణా, ప్రవృత్తి రీత్యా శిష్యులకు బోధనా నాటకశిక్షణా, అధర్మంపై విరుచుకుపడే సహజాతం... వంటి గుణాల వల్ల ఈ పాత్ర కాకిలా, గోదురుకప్పలా మాటిమాటికీ గొడవచేస్తూ అరుస్తూ ఉండేలా నామసార్థక్యంతో పేరుపొందిందనవచ్చు.

ఈ పాత్రకు రంగస్థల గౌరవం, ప్రేక్షక సంఘ ఆదరణా, సహజ సుగుణ ధర్మాదులూ ఇలా యెన్నివున్నా నులకబావ గారి దృష్టిలో ఇతనిది నింద్య జీవనమే.

ఇలా ఈ మూడు ఉపపత్తుల్నీ సమన్వయించుకొంటూ గురజాడ ఈ పాత్రకు ఈ మారుమూల నిఘంటు పదాన్ని పేరుగా పెట్టి ఉండవచ్చునని ఊహించడం కన్నా; ఈ పదానికున్న నాలుగో అర్థాన్ని కూడా దృష్టిలో ఉంచుకొని అసలీ వింత పదం గురజాడకు స్ఫురించడంలో గల కారణాన్ని రూఢిగా తెలుసుకొందాం.

శూద్రకుని సంస్కృత నాటకం మృచ్ఛకటికంలో ఈ పేరున్న పాత్ర లేదుగాని మంచి రసపట్టుగల ఘట్టంలో ఈ వింత పదం నాలుగో అర్థప్రధానంగా ప్రయోగింపబడింది. ఆరో

అంకంలో గోపాల దారకుడైన ఆర్యకుణ్ణి అన్వేషిస్తూ చందనక, వీరకులు కయ్యానికి దిగుతారు. వృత్తిరీత్యా సేనాధిపతియైన చందనకుడు జన్మతః చర్మశుద్ధికారుడు. అంచేత అతనిని ఎద్దేవచేస్తూ వీరకుడు-

''జాతిస్తవ విశుద్ధా! మాతాభేరీ! పితాపితే పటహః!
దుర్ముఖ కరటక భ్రాతా! త్వమసి సేనాపతిర్జాతః!

అని తూలనాడతాడు. అంటే ''ఓ చర్మశుద్ధికారుడా! నువ్వు మాకు సేనానాయకునిగా తయారయ్యేవేగాని నీ అమ్మ ఒక భేరీరా! నీ బాబు డప్పురా! నీ అన్న 'కరటకం'రా!'' అని అర్థం. 'కరటకం' అంటే 'వాద్య విశేషం' అని నిఘంటువు చెప్పిన నాలుగో అర్థం. ''దుందుభి, తప్పెటల వంటి చర్మవాద్య విశేషాన్ని కరటకం అంటారని మృచ్ఛకటిక వ్యాఖ్య.

అంచేత మొత్తం నాలుగర్థాల్నీ కలగలిపి చూసినా బడబడవాగే గబగబ మాటలాడేవాడనే అర్థమే మనకు అభివ్యక్తం అవుతోంది.

జిత్తులు వేస్తూ ఎత్తులు మారుస్తూ జగత్ప్రసిద్ధికెక్కిన నక్క ఒకటి ఇదే పేరుతో సరిగా గురజాడ వారి కాలంలోనే చిన్నయసూరి ద్వారా తెలుగు సాహితీక్షేత్రంలోకి సంస్కృత భూమి నుండి వలస వచ్చింది.

ఈ సాకల్య పరిశీలన వల్ల గురజాడ తనకు మృచ్ఛకటిక, నీతిచంద్రికల ద్వారా స్ఫురించిన ఈ కరటక పదాన్ని ఆయా అర్థాల అవగాహనతో ఈ పాత్రకు వింతగా నామకరణం చేసేరనడంలో న్యాయమే ఉంది తప్ప; ఆ మహాకవికేపాటి లోటూ కల్పించదు.

**2. సౌజన్యారావు పంతులు :** సుజనుని భావం సౌజన్యం. సౌజన్యం అచ్చుమచ్చు రూపుదాల్చిన ట్లున్న ఈ పాత్రకు ఈ కొత్త పేరును పెట్టడంలోనూ శూద్రకుని ప్రోద్బలమే బలంగా ఉందని మృచ్ఛకటిక ఎనిమిదో ఆశ్వాస శ్లోకంలోని ''హా! సౌజన్యనదీ ప్రహాసపులినే!'' అనే సుందర రూపక సమాస విన్యాసం రుజువు చేస్తోంది.

మృచ్ఛకటిక, చారుదత్త నాటకాలెంతగా కన్యాశుల్క నాటకాన్ని ప్రభావితం చేసాయో పండిత జన ప్రతిపాదితమే గాబట్టి ఈ రెండు పాత్రల్నీ పేర్కొనడంలో గురజాడకు తప్పనిసరిగా పై నాటక ఘట్టాలే తోడ్పడ్డాయనడంలో తప్పేం లేదు.

**3. మధురవాణి :** ఈ పేరుతో తంజావూరు నాయకరాజుల కాలంలో సుప్రసిద్ధ వేశ్యా కవయిత్రి ఉండటం మనకి తెలిసిందే!

లుబ్ధావధానులు, నులక అగ్నిహోత్రావధానులు:- ఈ రెండు కృతక నామాలూ ఏ ఇతర ప్రభావానికీ లోనుగాని గురజాడ స్వకపోల కల్పితాలే.

ఇలా తన నాటకంలోని అయిదు పాత్రలకు వాటివాటి మనోభావాలకు అద్దంపట్టినట్లు పేరుపెట్టి అద్వితీయంగా కన్యాశుల్క నాటకాన్ని రచించిన గురజాడకు దక్కిన మరో వింత గౌరవాన్ని ఈ సందర్భంలో ప్రస్తావించుకొందాం.

పై ఐదు పేర్లలో మూడింటిని గురజాడ తరవాతి తరాల వారి దైనందిన సంభాషణల్లో చెదురుమదురుగా వాడుకోడం మాత్రమే జరుగుతోంది. కాని; మధురవాణి, సౌజన్యారావు అనే పేర్లు కన్యాశుల్క నాటక స్ఫూర్తితో కొందరు తమ పిల్లలకు నామకరణం చేసుకొన్నా రన్న విషయం విన్న మనకు వింత ఆనందాన్ని కలిగిస్తుంది. మహాకవుల కల్పనలకు ఇది కూడా ఒక సార్థకతే కదా! ★

సెప్టెంబర్ 28 – సర్ విలియమ్ జోన్స్ ద్విశత జయంతి

# భాషా విజ్ఞాన విధాత

# సర్ విలియం జోన్స్

– శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రి

వ్యాపారులుగా భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులు క్రమంగా భారతదేశాన్ని ఆక్ర మించుకున్నారు. ధనార్జనే వారి లక్ష్యంగా పరి ణమించింది. భారతదేశంలో బానిస వ్యాపారం బాగా పెరిగింది. ఒక్కొక్క బానిస ఈస్టిం డియా కంపెనీకి నాలుగు రూపాయల నాలుగ ణాలు పన్ను చెల్లించేవాడు. (చూ. ద గుడ్ ఓల్డ్ డేస్ ఆఫ్ ఆనరబుల్ జాన్ కంపెని - రచన: డబ్ల్యు.ఎచ్.కారే-1822, పుట: 121). కాని 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అన్నట్లు పాశ్చాత్యోద్యోగులు కొందరు బానిస వ్యాపారాన్ని ఖండించారు. వారు 'కొందరు



సర్. విలియమ్ జోన్స్

మాత్రమే కావచ్చు. ఆ కొందరే భారతదేశంలో భావవిప్లవానికి కారకు లయ్యారు. సహోద్యో గులు సుఖలోలుపులై, ధనార్జనపరులై స్వైరవిహారం జరుపుతున్న కాలంలో, కొందరు మాత్రం భారతీయ సంస్కృతిని, భాషలను అవగాహన చేసుకునేందుకు కృషిచేశారు. కారుచీకట్లలో కాంతిరేఖల్లా వెలిగారు. అలా వెలిగిన వారిలో అగ్రగణ్యుడు సర్ విలియం జోన్స్. భారతీయ సాంస్కృతిక భవన ద్వారాలను పాశ్చాత్యుల కోసం తెరచిన మహావిద్వాంసుడు సర్ విలియమ్ జోన్స్.

విలియం, మేరీ నిక్స్ దంపతుల మూడవ సంతానంగా ఆయన 1746 సెప్టెంబర్ 28న లండన్‌లో జన్మించాడు. మధ్యతరగతి కుటుంబమది. తండ్రి నౌకాదళంలో అధికారి. గణితశాస్త్రంలో పేరుగాంచినవారు. బ్రిటిష్ రాజకుటుంబంతో సన్నిహిత సంబంధాలు కలవాడు. రాయల్ సొసైటీలో 'ఫెలో' కూడా. జోన్స్ మూడవ ఏటనే తండ్రి విలియం కన్ను మూసాడు. తండ్రి గుణములు, అతని రచనలు, సంపద అన్నీ జోన్స్‌కు సంక్రమిం చాయి. తండ్రికి మిత్రులైన ఐజాక్ న్యూటన్, సామ్యుయల్ జాన్సన్ ఎడ్మండ్ హ్యాలీలతో జోన్స్‌కు సన్నిహిత సంబంధా లుండేవి.

జోన్స్ నాలుగేళ్ళవాడుగా వున్నపుడు జరిగిన అగ్నిప్రమాదంలో కుడి కన్ను బాగా దెబ్బ తినింది. కన్ను కోల్పోయినా అతనికి చదువుపట్ల ఆసక్తి ఏమాత్రం తరగలేదు. తొమ్మిదో ఏట జరిగిన ప్రమాదంలో తొడ ఎముక విరిగింది. కాని హ్యారో స్కూల్‌లో చదువు కొనసాగించాడు.

జోన్స్ జ్ఞాపకశక్తి అద్భుతమైంది. చాల మేధావిగా ప్రశంస అందుకున్న జోన్స్‌కు షేక్స్‌పియర్ నాటకాలలోని సన్నివేశాలన్నీ కంఠస్థం. జోన్స్ చదువుతున్న కళాశాల వార్షికోత్సవాల్లో షేక్స్‌పియర్ రచించిన 'టెంపెస్ట్' నాటకం ప్రదర్శించాలనుకున్నారు. నాటకం ప్రతి కానరాలేదు.. విలియం జోన్స్ నాటకం మొదటి నుంచి చివరిదాకా కేవలం తన జ్ఞాపకశక్తితో రాసి ఇచ్చాడు. అద్భుతమైన ఈ జ్ఞాపకశక్తి వల్లనే జోన్స్ గొప్ప విద్వాంసుడయ్యాడు. మెట్రిక్యులేషన్ (1764) పరీక్ష ఇచ్చేనాటికే గ్రీక్ తత్త్వవేత్తల, నాటకకర్తల రచన లన్నిటినీ అధ్యయనం చేశాడు. 1773లో ఎం.ఏ., పట్టభద్రుడై (ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం) ఓరియంటలిస్ట్ (ప్రాచ్య పండితుడు)గ ప్రశస్తి నార్జించాడు. విద్యార్థిగ 'బెనెట్ స్కాలర్'గా, 'బెనెట్ ఫెలో'గా విశిష్టమైన విద్యార్థి వేతనాలను సంపాదించుకున్నాడు.

ఇరువది ఎనిమిది భాషలలో పాండిత్యం గడించాడు. ప్రాచ్య పాశ్చాత్య న్యాయశాస్త్రాలు, కావ్య, నాటకాలు క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. బ్రిటిష్ దమనకాండను ఖండిస్తూ మానవహక్కుల పరిరక్షణ కోసం పోరాటానికి ఉద్యమించాడు. 38 ఏళ్ళ ప్రాయంలోనే కలకత్తా సుప్రీంకోర్టు జడ్జిగా భారతదేశం చేరే నాటికి, ఎన్నో మహోన్నత ఆశయాలు కలిగివుండేవాడు. 1785లో భారతదేశంలో, ముఖ్యంగా కలకత్తా నగరంలో సాగుతూ వుండిన బానిస వ్యాపారాన్ని చిత్రిస్తూ, సర్ విలియం జోన్స్ "I am assured from evidence which though not all judicially taken has the strongest hold on my belief, that the condition of slaves within our jurisdiction is beyond imagination, deplorable; and that cruelties are daily practised on them, chiefly on those of the tenderest age and the weaker sex, which if it would not give me pain to repeat and you to hear, yet for the honour of human nature, I should forbear to particularise.... Hardly a man or a woman exists in a corner of the populous town, who hath not at least one slave child either purchased at a trifling price, or saved perhaps from a death that might have been fortunate, for a life that seldom fails of being miserable. Many of you, I presume, have seen large boats filled with children, coming down the river for open sales at Calcutta. Nor can you be ignorant that most of them were stolen from their parents, or bought, perhaps for a measure of rice in a time of scarcity" (The good old days of Honourable John company by W.H.Carey, Simla-1822, page 73)

సంస్కృత భాషను అధ్యయనం చేసి మనుధర్మశాస్త్రాన్ని ఇంగ్లీష్‌లోకి అనువదించటం, భారతీయ న్యాయశాస్త్ర సంగ్రహం, ప్రాచ్య పాశ్చాత్య సంబంధాలను నిరూపించటం జోన్స్ లక్ష్యాలుగా ఉండేవి.

సంస్కృత భాష యొక్క విశిష్టతను చాటుతూ "The Sanskrit language, whatever, be its antiquity, is of a wonderful structure more perfect than greek, more copious than Latin and more exquisitely refined than either, yet bearing to both of them a stronger affinity, both in the roots of verbs and in the forms of grammar, than could possibly have been produced by accident; so strong indeed that no philologer could examine them all three, without believing them to have sprung from some common source" (2.2.1976న సర్ విలియమ్ జోన్స్ ఉపన్యాసం నుంచి)

భాషాధ్యయనంలో చదువుకంటె వ్రాత ముఖ్యమని భావించిన జోన్స్, ఆ యా భాషీయులు మాట్లాడే తీరును శ్రద్ధగా ఆకళించుకున్నాడు. పర్షియన్ భాషలో తలస్పర్శి పాండిత్యం సంపాదించాడు. భాషాశాస్త్ర వేత్తగ, ప్రాచ్యవిజ్ఞాన వేత్తగ, న్యాయశాస్త్ర నిష్ణాతుడుగా అతని కృషి అసామాన్యమైనది.

న్యాయవాదిగ జోన్స్ గొప్ప పేరు సంపాదించనప్పటికి న్యాయశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. 1970-1983 మధ్య ప్రాచ్య ఇతిహాస, భాషా, న్యాయశాస్త్రాలకు, సాహిత్యానికి సంబంధించిన తొమ్మిది గ్రంథాలను రచించి, ''జోన్స్ రచనలు చదివితే సాహిత్య ప్రపంచ మంతా కరతాలమలకమే'' అన్నంత పేరు సంపాదించాడు. 1778లోనే జోన్స్‌ను కలకత్తాలోని సుప్రీంకోర్టు న్యాయమూర్తిగ ఆహ్వానించినా, 1783లో అతడు ఆ పదవిని చేపట్టాడు.

## న్యాయమూర్తిగా :

భారతదేశంలో ఈస్టిండియా కంపెనీ పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉండేవి. కంపెనీ ఉద్యోగులు అవినీతిపరులుగా అక్రమార్జనకు అర్రులు చాచేవారు. ప్రజలను పీడించేవారు. అక్రమాలను భరించలేక ప్రజలు అధికారులను ధిక్కరించసాగారు. రెగ్యులేటింగ్ ఆక్ట్ మేరకు కలకత్తాలో సుప్రీంకోర్టు ఏర్పాటు చేయబడింది. గవర్నర్ జనరల్‌గా ఉండిన వారన్ హేస్టింగ్స్, భారతప్రజల భావాలను గ్రహించి, న్యాయమూర్తిగ సర్ విలియం జోన్స్‌ను నియమింపచేశాడు.

భారతీయ విజ్ఞానమంతా సంస్కృతంలో నిక్షిప్తమైనదని విశ్వసించిన విలియం జోన్స్ బెంగాల్‌లోని ప్రముఖ సంస్కృత విద్వాంసుల వద్ద అధ్యయనం సాగించాడు. హిందూ పురాణేతిహాసాలను గురించి ఇంగ్లీష్‌లో రచనలు చేశాడు. హిందూ, గ్రీక్ దేవతల తులనాత్మక అధ్యయనం చేశాడు. భారతీయ సంస్కృతి ప్రచారం కోసం ''ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్'' అను సంస్థను 1784 జనవరి 14న ప్రారంభించాడు (ప్రస్తుతం రాయల్ ఏషియాటిక్ సొసైటీ). సంస్కృత సాహిత్య భాండారాన్ని మథించాడు. సంస్కృతంలో అనర్గళంగా ఉపన్యసించేవాడు జోన్స్. 1789లో జయదేవుని 'గీతగోవిందమ్'ను ఆంగ్లమునకు అనువదించాడు. కాళిదాస కవికృత అభిజ్ఞానశాకుంతలమును మొదట గ్రీక్ భాషలోను, ఆ తర్వాత 1789 అక్టోబరులో ''శాకుంతల ఆర్ ద ఫేటల్ రింగ్'' అనే పేర ఇంగ్లీషులోనికి అనువదించాడు.

భారతీయ ఇతిహాసాలు, తత్త్వశాస్త్రం పట్ల అతని కెంతో అభిరుచి. శంకరుల అద్వైత సిద్ధాంతం విలియమ్ జోన్స్‌ను అమితంగా ఆకర్షించింది. భారతీయులలో మూఢాచారాలున్నప్పటికీ వారిని తత్త్వవేత్తలని విశ్వసించాడు. తర్క, గణిత, రేఖాగణిత శాస్త్రాలలో భారతీయుల ప్రతిభను విదేశీయులకు వెల్లడించాడు. బహుముఖ వ్యాసంగాలలో తలమునుకలవుతున్న కారణంగా భారతీయ ధర్మశాస్త్ర సంకలన గ్రంథం (డైజెస్ట్ ఆఫ్ ఇండియన్ లాస్) పూర్తి చేయలేక పోయాడు.

## భాషా విజ్ఞాన విధాత :

భారతదేశంలో వ్యాకరణశాస్త్రం వేదమువలె ప్రాచీనమైనప్పటికీ, భాషా విజ్ఞానం మాత్రం

పాశ్చాత్య ప్రభావంతో మొగ్గవేయ తొడగింది. విభిన్న భాషల్లో పండితుడైన విలియమ్ జోన్స్ సంస్కృత భాషాధ్యయనంతో కొత్తపుంతలు వేశాడు.

"It was largely due to the rediscovery of Sanskrit by Sir William Jones and others torwards the close of the century (18th) that this Latin domination was shaken, that the ancint Indo-European languages were reconstructed and that the modern science of linguistics was initiated" (Language in the Modern world by Simon potter - A. Pelicon Book - 1960 - pages 12, 13).

సంస్కృత ధ్వనిశాస్త్ర, వ్యాకరణ, శబ్దరూప, వాక్యరచనాదులను గ్రీక్, ల్యాటిన్ భాషలతో పోల్చిచూచినప్పుడు, వాటి అపూర్వ సామ్యములను గమనించి, వీటికన్నిటికీ ఒకే మూలం ఉండాలని భావించాడు జోన్స్. ఈ భావమే ఆధునిక భాషా విజ్ఞానానికి, తులనాత్మక భాషా విజ్ఞానానికి బీజావాపనమైంది. ఇతర జాతులతో భారతీయ జాతుల అధ్యయనానికి ప్రేరకమైంది. తన పరిశోధనాంశాలను ఏష్యాటిక్ సొసైటి మూడవ ఉపన్యాసంలో (2.2.1786) వెల్లడించాడు. సంస్కృత భాష, గ్రీక్, ల్యాటిన్‌ల కంటె అత్యంత పరిపుష్టమైనది, ధాతురూప, శబ్దరూప, వాక్యరచనా విధానాల నేపథ్యాన్ని బట్టి ఇవన్నీ ఒకే మూల భాషాజన్యములని ప్రతిపాదించాడు. సర్ విలియమ్ జోన్స్ రాయల్ ఏష్యాటిక్ సొసైటీ అధ్యక్షుడుగా ఉన్నంతకాలం ప్రతి ఏటా వినూత్నమైన, విస్మయకరమైన సిద్ధాంతాలను ప్రకటిస్తూ భారతీయ విజ్ఞానమును (ఇండాలజీ), సంస్కృత సాహిత్యమందలి జ్ఞానభాండారాన్ని పంచిపెట్టాడు. తన పది ఉపన్యాసాలలో అపూర్వమైన విషయాలను వెల్లడించాడు. సంస్కృత భాషను అరబిక్ భాష నుండి విడదీసి, హీబ్రూ భాషకు అనుసంధానం చేశాడు. సంస్కృత భాషా భాండారం నుండి పదివేల పదాలను ఇంగ్లీష్‌లోనికి అనువదించాడు. 'హ్యాలిఫి' పర్షియన్ భాషలో రచించిన 'లైలామజ్నూ'పై ఇంగ్లీష్‌లో వ్యాఖ్య రచించాడు.

విలియమ్ జోన్స్ భార్య అన్నా మరియాకు భారతదేశ వాతావరణం పడలేదు. ఆమెను శీతల దేశమైన ఇంగ్లండుకు పంపమని వైద్యులు ఆయనకు సలహా ఇచ్చారు. భార్యతోపాటు తాను కూడా ఇంగ్లండు వెళ్ళాలనుకున్నాడు. కాని తాను తలపెట్టిన 'డైజెస్ట్' అసంపూర్తిగ వున్నదని, ఆ పని పూర్తిచేయమని భార్యప్రోత్సహించింది. అనుకున్న వ్యవధికంటె ఏడాది ముందుగానే ఆమె ఇంగ్లండు వెళ్ళింది. 1794 తొలిదశలో విలియం జోన్స్ తన ''ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిందూ లా'' రచనను తృప్తికరంగా సాగించాడు. ప్రధానభాగం ముద్రణ కివ్వబడింది. లివర్ వ్యాధి పీడితు డయ్యాడు. ఏప్రిల్ నెల వేడిమికి తోడు, నిరంతర కృషి అతని వ్యాధిని ఇనుమడింప చేసింది. వైద్యుల శ్రమ నిష్ఫలమై, సర్ విలియం జోన్స్ ఏప్రిల్ 27, 1794న. కన్నుమూశాడు. అతని మహత్త్వపూర్ణమైన రచన 'డైజెస్ట్ ఆఫ్ ఇండియన్ లాస్' అసంపూర్తిగానే మిగిలింది. తెల్లదొరల ప్రతినిధిగా వచ్చిన విలియం జోన్స్ భారతీయులకే మార్గదర్శకుడైనాడు. భారతీయ భాషా వైభవాన్ని ఆవిష్కరించిన భారతీయ భాషా విజ్ఞాన విధాత సర్ విలియమ్ జోన్స్!

**ఉపయుక్త రచనలు:**

1. సి.పి.బ్రౌన్ - డా. కొత్తపల్లి వీరభద్రరావు- 1988
2. భాషావిజ్ఞాన విధాత - విలియమ్ జోన్స్-'తరంగ' కన్నడ వారపత్రిక 7.8.94. రచనా: డా. ఉప్పంగళ రామభట్ట
3. Bhavan's Journal - Fef 16-28-1986.

# వట్టి వల్లింపు కాదు ఆకళింపు ముఖ్యం

ఎన్. అంజయ్య

'ఆత్మనింద' పేరుతో ఇతరులను వినకుండ చదవకుండ కొట్టిపారవేయగల ఆచార్య పి.యస్. శాస్త్రి సామర్థ్యాన్ని జూలై సంచికలోని ఆయన సమాధానం మరొకమారు రుజావు చేసింది. ఆచార్య దయాకృష్ణ లేవనెత్తిన ప్రశ్నలను పరిశీలించడంలో రెండవసారి కూడా ఆచార్య శాస్త్రి శ్రద్ధ చూపిన దాఖలాలు కనిపించడం లేదు. అది ఎలానో చూద్దాం.

ఆచార్య దయాకృష్ణ 'తాత్వికపూర్వాశ్రమంతో గాని, వారి వర్తమాన ఆలోచనతోగాని ఈ వ్యాసరచయితకు సంబంధం లేదన్న విషయాన్ని జూన్ 1994 'మిసిమి' సంచికలో (పేజీ. 218 రెండు, మూడు పేజీలలో) స్పష్టపరచడం జరిగింది. జూన్ సంచికలో ఆచార్య దయాకృష్ణ అభిప్రాయాలను పాఠకుల సౌకర్యార్థం మరోసారి పునరుద్ఘాటించడం జరిగింది. అవి ఈ రచయిత అభిప్రాయాలు కావు. ఆ వివరణను ఆచార్య శాస్త్రి గమనించలేదు. ఫలితంగానే ఆచార్య దయాకృష్ణను, ఈ రచయితను జూలై 1994 'మిసిమి' సంచికలో ఆచార్య శాస్త్రి ఒకే గాట కట్టివేశారు. ఇది శాస్త్రి హోదాకు తగని పని.

తత్వశాస్త్రంలో ఆధ్యాత్మిక వాదమంటే ఏమిటో ప్రశ్నవేసుకొని, దానికి ఆచార్య దయాకృష్ణ ఇచ్చిన వివరణను 1994 జూన్ మిసిమి సంచికలో ఇలా వివరించడం జరిగింది. ''ఒక దేశ యావత్ తాత్విక సంప్రదాయాన్ని 'ఆధ్యాత్మిక'మైనదిగా వర్ణించడమంటే అర్థమేమిటి? సత్తాశాస్త్రం (Ontology) దృష్ట్యా 'ఆధ్యాత్మిక' అర్థాన్ని పరిశీలించినప్పుడు అంతిమ వాస్తవికతను మనస్సులేక చైతన్యం అన్న పదానికి సమాన అర్థం కాని లేక దరిదాపు అర్థంగాని భావించవలసి ఉంటుంది. జడత్వం కలిగిన భౌతికవస్తువుకంటే మనస్సు లేక చైతన్యం ముందరిదన్న విషయాన్ని ఆధ్యాత్మికత నొక్కి చెబుతుంది. మరొక విధంగా చెప్పాలంటే పదార్థానికి మనస్సు వ్యతిరేకమైనది. మనస్సొక్కటే నిజమైనది. పదార్థం మిథ్య అన్నది ఆధ్యాత్మిక అధిభౌతికవాద అర్థం'' (పేజీ 218). దీనిని ఆచార్య శాస్త్రి ఎంత అసమంజసంగా, అసమబద్ధంగా ఉటంకించారో జూలై మిసిమి సంచికలోని ఆయన సమాధానంలోని రెండవ పేరాలోను మొదటి రెండు వాక్యాలను చూస్తే తెలిసిపోతుంది. (పేజీ. 254). అలానే ఈ రెండు వాక్యాలకు కొనసాగింపుగా, ఈ రచయిత జూన్ మాసపు మిసిమి సంచికలో ఎక్కడా చెప్పని మరో రెండు వాక్యాలను శాస్త్రి ఉటంకించారు.

ఆచార్య దయాకృష్ణ చెప్పినట్లు, అంటే మనస్సు లేక చైతన్యం అగ్రిమం, పదార్థం అనగ్రిమం అని చెప్పే వాదాన్ని ఆధ్యాత్మిక వాదమని తనకెవరు చెప్పలేదంటూనే ''అద్వైత దర్శనమున, మధ్యమక దర్శనమున, F.M. Bradley వంటివారి రచనలలోను, ప్లేటో

రచనలలోనూ కొంత నమ్మకమున్నది. అలాంటి దృక్పథముతోనే వివేచన చేస్తున్నాను'' అని ఆచార్య శాస్త్రి జూలై సంచికలో తన సమాధానాన్ని మొదలుపెట్టారు. (పేజీ. 254).

అద్వైత దర్శనం, మధ్యమక దర్శనం, ఎఫ్.హెచ్. బ్రాడ్లీ, ప్లేటోల తాత్త్విక అభిప్రాయాలను సత్తాశాస్త్రం దృష్ట్యా చూస్తే ఆ దృక్పథాలు భావవాదాన్ని లేక ఆధ్యాత్మిక వాదాన్ని ప్రతిబింబిస్తాయన్న విషయం తత్త్వశాస్త్ర చరిత్రతో పరిచయం ఉన్నవారికెరుకే. ఆ దృష్టి నుండే తాను ప్రస్తుత చర్చను వివేచన చేస్తానని ఆచార్య శాస్త్రి చెప్పడమంటే భావవాదాన్ని లేక ఆధ్యాత్మిక వాదాన్ని తాను నమ్ముతానని, ఆ కోణం నుండే భారతీయ తాత్త్విక సంప్రదాయాన్ని పరిశీలిస్తానని చెప్పడంలోని పరమార్థమేమిటి? భారతీయ తాత్త్విక సంప్రదాయం ప్రధానంగా ఆధ్యాత్మికమైనదిగా తాను భావిస్తున్నానని చెప్పడమేకదా! అలా చెప్పే హక్కు ఆచార్య శాస్త్రికి ఉంది. ఇందుకు వైయక్తిక వైవిధ్యమే కారణం. వైయక్తిక వైవిధ్యత దృష్ట్యా ఇతరులు భిన్న దృక్పథాన్ని ప్రదర్శించినప్పుడు వారికలాంటి హక్కులేదని చెప్పడం శాస్త్రి అప్రజాస్వామిక ధోరణే అవుతుంది.

సత్తాశాస్త్రం దృష్ట్యా భారతీయ తాత్త్విక సంప్రదాయాన్ని కేవలం ఆధ్యాత్మికమైనదని చెప్పడం సరికాదని, అది వస్తుగత పరిశీలన దృష్టిని ప్రతిబింబించదని ఆచార్య దయాకృష్ణ అభిప్రాయం. భారతీయ తాత్త్విక సంప్రదాయంలో భౌతికవాద ధోరణులు కూడా ఉన్నాయి కనుక ఆ సంప్రదాయాన్ని పూర్తిగా ఆధ్యాత్మికమైనదని చెప్పడం సరికాదని, ఇది భారతీయ తాత్త్విక సంప్రదాయం పట్ల ఉన్న ఒక మిథ్యాపూరిత అవగాహనని దయాకృష్ణ భావన. ఇదే ఆయన వ్యాసంలోని మొదటి ప్రశ్న. ఈ ప్రశ్ననే దయాకృష్ణకంటే ముందు ఎం.ఎన్.రాయ్, వాల్టేర్, రూచన్, దేవీప్రసాద్ చటోపాధ్యాయ్... లాంటివారు వేశారు. భారతీయ తాత్త్విక సంప్రదాయంలో ఎక్కువ భాగం ఆధ్యాత్మికమైనది కాదని, భౌతికవాద ధోరణులు, ఆధ్యాత్మిక వాద వ్యతిరేక ధోరణులే ప్రబలంగా ఉన్నాయని దేవీప్రసాద్ చటోపాధ్యాయ్ లాంటివారు ప్రామాణికంగా నిరూపించారు. సత్తాశాస్త్రం దృష్ట్యా ఆచార్య దయాకృష్ణ లేవనెత్తిన ప్రశ్న సరైనదా? కాదా? ప్రశ్న సరైనదైతే అదే సగం సమాధానమౌతుంది. ప్రశ్నకు వచ్చే సమాధానంలో విరుద్ధ అభిప్రాయాలు వ్యక్తం కావచ్చు. అది వేరే విషయం. కాని ఆచార్య శాస్త్రి దయాకృష్ణపై తాను చేసిన విమర్శలో (చూడండి. మిసిమి, ఏప్రిల్ సంచిక 1994) అసలు ప్రశ్ననే వెక్కిరించారు. జూలై సంచికలోని తన సమాధానములో కూడా మరోసారి దయాకృష్ణ ప్రశ్నను గుర్తించ నిరాకరించారు. కాని శాస్త్రి తాత్త్విక దృక్పథం, అదే భావవాద లేక ఆధ్యాత్మికవాదం వత్తిడి వలన ఆయన తన సమాధానంతో బయటకు రాక తప్పింది కాదు. ఆయన సమాధానం ఈ రచయితకు అలానే తత్త్వశాస్త్ర విద్యార్థులకు తెలియనిది ఏమీకాదు. ''భారతీయ భావవాదము''న్న ఆచార్య శాస్త్రి రెండు సంపుటాల రచన ఇందుకు సాక్ష్యం. జూలై సంచికలో చెప్పిన సమాధానాన్ని ఏప్రిల్ సంచికలో శాస్త్రి చెప్పి ఉన్నట్లయితే మిసిమి పాఠకులకు కొంత శ్రమ తగ్గి ఉండేది.

ఆచార్య దయాకృష్ణ మొదటి ప్రశ్నకు జూలై సంచికలో శాస్త్రి ఇచ్చిన సమాధానం అసంపూర్ణం, అసమగ్రం, ఏకపక్షం, స్వీయ మానసికమైనది. దీనిని నిరూపించడం అంత కష్టమేమీ కాదు. కాకపోతే దయాకృష్ణ, శాస్త్రిల మధ్య సంవాదంలోనికి మూడోవ్యక్తి దిగడం

ప్రస్తుత చర్చాపరిధికి మించినపని. ఈ చర్చలోనికి దిగకుండా ఆచార్య శాస్త్రి సమాధానం ఏ విధంగా అసంపూర్ణమో రెండు ముక్కల్లో చెప్పవచ్చు. సత్తాశాస్త్ర దృష్ట్యా సాంఖ్యదర్శ నాన్ని భౌతికవాద దర్శనమనడం సరికాదని శాస్త్రి అన్నారు. భారతీయ తత్త్వశాస్త్రంతో పరిచయం ఉన్న ఎవరికైనా సాంఖ్య దర్శనాన్ని ''ప్రధాన కారణవాద''మంటారని తెలుసు. అందుకే బ్రహ్మసూత్రాలలో సాంఖ్య దర్శనాన్ని ప్రధాన శత్రువుగా భావించడం జరిగింది. అలానే చార్వాక దర్శనం భౌతికవాద దర్శనం కాదని శాస్త్రి ఉవాచ. ఇందుకు 'న్యాయమంజరి' లోని జయంతుని అభిప్రాయమే దృష్టాంతమని శాస్త్రి పేర్కొన్నారు. చార్వాకులను రెండు తెగలుగా విభజించడం సరికాదని, ఇది జయంతుడు వ్యంగ్యంగా చేసిన విభజన తప్ప, ఇది సరైన విభజన కాదని 'లోకాయత దర్శనం' మీద ప్రామాణికమైన పరిశోధన చేసిన దేవీప్రసాద్ చటోపాధ్యాయ్ పేర్కొన్నారు.

ఇక జైనం, బౌద్ధంలోని సౌతాంత్రిక వైభాషిక ధోరణులు, న్యాయ, వైశేషికాల్లాంటి దర్శనాలు సత్తా దృష్ట్యా ఏమిటో కూడా చర్చిస్తే బాగుండేది. కాని ఆచార్య శాస్త్రి ఒకే ఒక్క మాటతో ఈ బాధ్యత నుండి తప్పుకొన్నారు.

''తర్కా ప్రతిష్ఠానా దన్యథానుమేయ మితిచే దతి ప్రసంగః (2-1-11)
అని బ్రహ్మసూత్రం. సత్తానాశ్రయించుకొనిన ఎపిస్టమాలజీ జల్ప వితండవాదాలకే దారితీ స్తుంది'' (మిసిమి, జూలై సంచిక 1994. పేజీ. 255).

ఇక్కడ ఒక విషయాన్ని స్పష్టపరచ వలసి ఉంది. విశ్వాసాన్ని ఆధారం చేసుకొంటే అది మతమౌతుంది తప్ప తత్త్వశాస్త్రం కాలేదు.

తన మొదటి ప్రశ్నకు అనుబంధంగా వైదిక సంప్రదాయం ''అవైదికమత, ఆధ్యాత్మిక సంప్రదాయం నుండి మోక్ష భావనను స్వీకరించడం జరిగింది''ని దయాకృష్ణ పేర్కొన్నారు. ఇక్కడ అవైదిక సంప్రదాయమంటే ప్రధానంగా శ్రమణ సంప్రదాయం. ఈ విషయాన్ని దయాకృష్ణమూలవ్యాసంలో గమనించవచ్చు. దయాకృష్ణ ఈ వాదనను పూర్తిగా వినకుండానే ''బౌద్ధుల నుంచి మోక్షమనే నాల్గవ పురుషార్థాన్ని'' వైదిక సంప్రదాయం తీసుకొన్నదని దయాకృష్ణ చెప్పారని, అది ఏ విధంగా సరికాదో శాస్త్రి వివరించారు. ''ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, ఐతరేయ, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యకము లను దశోపనిషత్తులు బుద్ధునికి పూర్వమే వచ్చినై'' (జూలై మిసిమి, 1994 పేజీ. 256) కనుక శ్రమణ సంప్రదాయం నుండి ''మోక్ష'' భావనను తీసుకొనే గత్యంతరం వైదిక సాంప్రదాయా నికి లేదని శాస్త్రి పేర్కొన్నారు.

శ్రమణ సంప్రదాయం వైదిక సాహిత్యానికి సాంప్రదాయానికి అందించిన సేవలను తెలుసు కోదలచినవారు ఒక్కసారి ఆచార్య జి.సి. పాండే ''శ్రమణ సంప్రదాయం- దాని చరిత్ర, భారతీయ సంస్కృతికి సేవ'' ఉపన్యాస మంజరిని, ''భారతీయ సంస్కృతి పునాదులు''న్న గ్రంథం మొదటి సంపుటిలోని 60-103 పేజీలను, చూడవలసి ఉంటుంది. వైదిక సంప్ర దాయం స్వతంత్రమైనది. స్వయం సంపూర్ణమైనదని చెప్పాలన్న తన ప్రయత్నంలో భాగంగా కనీసం ముండకోపనిషత్ లాంటి రచనలపై శ్రమణ సంప్రదాయ ప్రభావాన్ని కూడా చూడ

నిరాకరిస్తున్నారు ఆచార్య శాస్త్రి. బి.ఎం. బారువా ''బౌద్ధపూర్వ భారతీయ తత్త్వశాస్త్ర చరిత్ర''ను ఈ సందర్భంలో చూడడం సముచితంగా ఉంటుంది. (పేజీ. 182). ముండకోపనిషత్‌కి ఆ పేరు శ్రమణ సంప్రదాయం వలననే కలిగిందన్న విషయాన్ని కూడా శాస్త్రి చూడడం లేదు. మొత్తం భారతీయ తాత్త్విక సంప్రదాయానికి ఆచార్య శాస్త్రి ప్రకారం శంకరభాష్య మొక్కటే మూలం లాగుంది. అందువల్లనే శాస్త్రి ఇలా పేర్కొన్నారు. ''వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః సంన్యాస యోగాద్యతయః శుద్ధ సత్వాః (3-2-6) అని ముండకోపనిషత్ సంన్యాసాశ్రమాన్ని స్తుతించింది'' (చూడండి. పేజీ. 257. మిసిమి, జూలై 1994). ఇంతటితో కూడా శాస్త్రి ఆగలేదు. జాబాలోపనిషత్ నుండి కూడా ఆయన సాక్ష్యం తెచ్చుకొన్నారు. సంతోషం. అల్లోపనిషత్ సాక్ష్యంగా తెచ్చుకోలేదు.

వేదప్రమాణాన్ని అంగీకరించడం లేక తిరస్కరించడమన్న ప్రాతిపదికగా భారతీయ తాత్త్విక సంప్రదాయాన్ని వర్గీకరించడం సరికాదన్నది దయాకృష్ణ రెండవ ప్రశ్న. వేదప్రమాణాన్ని అంగీకరించడం లేక తిరస్కరించడమన్న విషయాన్ని యథావిధిగా, పైపైనే చూడడం కాక, దాని సామాజిక పర్యవసానం దృష్ట్యా ఆలోచించవలసి ఉంటుంది. ఈ పార్శ్వం దయాకృష్ణ ప్రశ్నలో కూడా కనిపించడం లేదు. ఒక వ్యక్తిగాని లేక ఒక సమూహం గాని తమకున్న అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి వేదాలను లేక త్రిపిటకాలను లేక ప్రజ్ఞాపారమితాలను ఆధారం చేసుకోవడమంటే సర్వత్రా వాటి అధికారికతను అంగీకరించడమౌతుంది. ఒక సాహిత్య సముచ్చయాన్ని, దాని పరిమితులను దాటకూడదని చెప్పడమంటే ఏమిటి? అంటే 'అధికారాన్ని' ప్రశ్నించకూడదని చెప్పడం దాని సామాజిక పార్శ్వం. ఇలాంటి అవగాహన స్వేచ్ఛాయుతమైన భావాభివృద్ధిని కుంటుపరుస్తుంది. వేద అవగాహనను అధిగమించి ఉపనిషత్ చింతన ఆధారంగా అభివృద్ధి చెందిన అద్వైత వేదాంతం ''వేద ప్రమాణాన్ని'' అంగీకరించడమంటే ఏమిటి? దాని సామాజిక పర్యవసానమేమిటి? వేద ప్రమాణానికి స్మృతులు ఎందుకు అంతటి ప్రాధాన్యతను అంటగట్టాయి లాంటి ప్రశ్నలు ''రెండవ ప్రశ్న'' సందర్భంలో చర్చకు అర్హమైన అంశాలు. కాని ఈసారి కూడా ఆచార్య శాస్త్రి అలాంటి ప్రశ్నలవైపు తన దృష్టిని మరల్చలేదు.

అలానే రెండవ ప్రశ్నతో అత్యంత సన్నిహిత సంబంధం కలిగిన మూడవ ప్రశ్న కూడా శాస్త్రి దృష్టిని అంతగా ఆకర్షించలేదు.

ముగించబోయే ముందు ఈ రచయితవైపు నుండి కొన్ని వివరణలు ఇవ్వవలసి ఉంది. పూర్వ మీమాంసకులు ఉపనిషత్‌లను వేదసాహిత్యంలో భాగంగా పరిగణించలేదన్న అభిప్రాయం ఈ రచయితది కాదు.

''శంకరభాష్యాలు లేకపోతే ప్రస్థానత్రయం క్రీ.శ. 1000 ప్రాంతంలోనో, క్రీ.శ. 1800 తర్వాతనో వచ్చినవని కూడా'' ఈ రచయిత వాదించగలరని శాస్త్రి సందేహాశ్చర్యాలను వెలిబుచ్చారు. వైదిక సంప్రదాయం ''మోక్ష'' భావనను ఎక్కడ నుండి అరువు తెచ్చుకోలేదని చెప్పడానికి శాస్త్రి భగవద్గీతను తిరుగులేని ఆధారంగా పేర్కొన్నారు. ఇంతటి అచారిత్రక (Ahistorical) పనికి మాత్రం ఈ రచయిత పూనుకోడని మాత్రం చెప్పగలను. ఆ విధంగా ఆచార్య శాస్త్రి విచారానికి కారణమైతే క్షమార్హులం.

---

# జీవన సరళి

- డా. సంజీవదేవ్

కోట్ల సంవత్సరాల నుంచి అనేక విధాల ప్రాణులు జన్మిస్తున్నాయి, జీవిస్తున్నాయి, మరణిస్తున్నాయి.

వివిధ వృక్షజాతులు, పక్షిజాతులు, సరీసృపాలు, సస్తనజీవులు పుడుతూ పెరుగుతూ చస్తూ ఉండటంతో కోట్ల సంవత్సరాలు గడచిపోయినాయి.

లక్షల సంవత్సరాల నుండి మానవ రూపం అనేక రీతుల్లో ప్రత్యక్షం కాజొచ్చింది.

మిగతా ప్రాణుల్లో లేని కొన్ని వైశిష్ట్యాలు మానవ ప్రాణుల్లో కనిపించసాగాయి. ఆ వైశిష్ట్యాల్లో ఒక విశిష్ట వైశిష్ట్యం మెదడు అనేది. కన్ను పని చూడటం; చెవి పని వినటం; అదే విధంగా మెదడు పని ఆలోచించటం.

ఇటువంటి మెదడున్న మానవులనే శాస్త్రజ్ఞులు homo sapiens అన్నారు. అప్పటి నుంచే ఆధునిక మానవుని ఆవిర్భావం.

కొందరి మానవుల మెదడులు చాలా తక్కువ ఆలోచిస్తే, ఇంకొందరివి అంతకంటే కొంత ఎక్కువ ఆలోచిస్తాయి. ఇక కొద్దిమంది మెదడులు చాలా ఎక్కువ ఆలోచిస్తాయి. ఇటువంటి వారినే అంటారు మేధావులని.

మేధావికీ మేధావి కానివానికీ తేడా ఎక్కడ?

మేధావి కాని వ్యక్తి వస్తువు పై భాగాన్ని మాత్రమే చూస్తాడు. మేధావి ఆ విధంగా కాక వస్తువు పై భాగాన్ని పగులగొట్టి లోపలి భాగాన్ని అందుకుంటాడు. కన్ను చూడని దాన్ని గ్రహిస్తాడు.

మేధావిది విశ్లేషణ మార్గం (analysis), మేధావి కానివానిది సంశ్లేషణ మార్గం (Synthesis). మెదడు ఎడమ భాగం ప్రధానంగా ఆలోచనను కలిగివుంటే కుడిభాగం కలిగి ఉంటుంది అనుభూతిని.

మిగతా అన్ని ప్రాణుల కంటే మానవునిలోని ప్రత్యేకత ఆలోచన.

మానవుని ప్రధాన ఆలోచన ఏమంటే తానెవరు అని, తానెక్కడ నుంచి వచ్చానా అని, తానెక్కడికి పోతానా అని, తానెందుకు ఇక్కడికి వచ్చానా అని, తన చుట్టూవున్న వ్యక్తులతో తన సంబంధం ఏమిటా అని, ఇంకా ఇటువంటివెన్నో.

కొందరికి వీటన్నిటి సమాధానాలు సక్రమంగా దొరకవు. కొన్నిటి సమాధానాలు మాత్రమే కొందరికి దొరుకుతాయి. ఎవరికైనా దేని సమాధానమూ దొరకకపోవచ్చు.

సమాధానం దొరికినా దొరక్కపోయినా ఆలోచించటం అనే క్రియ చాలా ప్రధానమైంది. మనిషిలో ఆలోచించటం అనేది మేల్కొని ఉంటే సాఫల్యం ఎప్పటికైనా అందకపోదు.

మనిషి బ్రతుకులో ఆలోచనది ప్రధాన స్థానమే, సందేహం లేదు, అయినా ఆలోచించటం మాత్రమే చాలదు, అనుభూతించటం మాత్రమే చాలదు, కవిత్వించటం మాత్రమే చాలదు, ఇంకా ఏమేమో చేయటం మాత్రమే చాలదు.

అవన్నీ నిత్యజీవితంలో సజీవ స్పందనలుగా అనుక్షణం అనుమేళించాలి; మన నిరంతర సహచరులుగా నర్తించాలి; సామాజిక జీవితాన్ని రక్తికట్టించాలి.

అదీ ఉన్నత జీవితం; అదీ ఉత్తమ జీవితం, ఉదాత్త జీవితం.

ఒక రోజంతా ఆలోచించేదానికంటే ఒక గంటసేపు ప్రమిదలోని వత్తి అయి వెలగటం ఎంతో మహోజ్వల కార్యం; ఒక గంట వత్తి అయి వెలగటం కంటే ఒక నిమిషం మానస గగనపు నీలిమేఘంపై ఇంద్రధనుస్సు అయి ప్రకాశించటం ఇంకా ఇంకా మహామహోజ్వల ఘటన.

ఇక అన్నిటికీ మించిన ప్రదీప్త చర్య ఒక్క క్షణం మహాశూన్యంలో మౌనరాగాన్ని ఆలాపించటం. ఈ అంతిమ చర్యయే జీవించటంలోని శిఖరాగ్రం.

భౌతిక స్థూలత్వం నుంచి మహాశూన్యపు చరమ సూక్ష్మత్వంలోకి తనను తాను రూపాంతర పరచుకోటం, ఆ విధంగా పరిణతి చెందటానికి ఇతర్లకు తాను పనిముట్టు కావటం, ఇతర్లు తనకు పనిముట్లు కావటం ఆదర్శజీవితపు, ఆనందజీవితపు జీవన రీతి, జీవన నీతి, జీవన గీతి!

నేడు మనిషి ముప్పయివేల ఏళ్లనాటి ప్రాచీన శిలాయుగాన్ని దాటి ఇరవై వేల ఏళ్లనాటి, మధ్య శిలాయుగాన్ని దాటి, పదివేల ఏళ్లనాటి నవ్య శిలాయుగాన్ని దాటి, నాలుగువేల ఏళ్లనాటి తామ్రయుగాన్ని దాటి, ఇంకా ఇవతలి లోహ (ఇనుము) యుగాన్ని దాటి పరమాణుయుగంలో జీవిస్తున్నాడు.

జడ స్థౌల్యం నుంచి విముక్తుడై చేతనా సౌక్ష్మ్యంలోకి పయనించాడు మనిషి.

ఆధునిక భౌతికశాస్త్రం జడాన్ని అంతా ఎలెక్ట్రాన్సులోకీ, పాజిట్రాన్సులోకీ, న్యూట్రాన్స్‌లోకీ, చేతనను ఫొటాన్స్‌లోకి, తరంగాలలోకి పరిణత పరచింది. ఇది చాలదు, ఇంతకంటే సూక్ష్మ పరిణతి ఉంది.

నవమానవుడు శూన్యంలో ఆడుతున్నాడు, మౌనంలో పాడుతున్నాడు. ★

## Holidays in India

| | | |
|---|---|---|
| Saturday-Sundays | : | 104 days |
| Yearly paid leave (i.e., earned leave) | : | 30 days |
| Yearly half paid leave | : | (20 days) or |
| on medical grounds, etc. | : | 10 days full pay leave. |
| Casual leave | : | 12 days |
| Public Halidays | : | 16 days |
| Restricted Holidays | : | 2 days |
| TOTAL | : | 174 days |
| Maternity leave of women | : | 90 days |

# రస దృష్టి

– ఆచంట జానకిరామ్

ఈ మధ్య ఒకరిని చూడడానికి వెళితే, వారి ఇంటిచుట్టూ ఉన్న తోటలో చక్కగా వికసించిన రకరకాల పువ్వులను చూచి, ఎంతో ముగ్ధుడనయ్యాను. కాని, వారు కూర్చునే గదిలో మధ్య బల్లమీద ప్లాస్టిక్ టేబిల్ క్లాతూ, పూల సజ్జలో ప్లాస్టిక్ పువ్వులూ చూచి చాలా బాధపడ్డాను. వారితో చెపుదామను కున్నాను. ''మీ తోటలో అన్ని రకాల పువ్వులున్నవి కదా, మీకు ఈ కృత్రిమ పువ్వుల ఖర్మమేమి? అనీ'' ''కాస్త శ్రమపడితే ఖద్దరులో గాని చేనేత వస్త్రాలలో గాని చాలా చాలా అందమైన టేబిల్ క్లాత్‌లను కొనవచ్చు కదా'' - అనీ. కానీ, వారి మనస్సును బాధ పెట్టడ మెందుకని ఊరుకున్నాను.

ఐతే. దేశమంతటా ఈ కృత్రిమపు అలంకార వస్తువులు అనేక రకాలవి చాలా చౌకగా లభిస్తున్నవి. ఆ మాటకొస్తే, నేను ఎవరికైనా మనోహరమైన ఒక ఎర్రగులాబీ పువ్వును కానుకగా ఇస్తే, వారు వెంటనే అంటారు. ''ఎంత బాగుంది! అచ్చంగా కాగితం పువ్వులా ఉంది కదూ!'' అని. అంతగా దిగజారిపోయింది, మన కళాదృష్టి. ఇక మెడలో వేసుకునే హారాలు, తలలో పెట్టుకునే పూలచెండ్లూ ఇవన్నీ కూడా ప్లాస్టిక్‌లో దొరుకుతున్నాయి. వానిని మనవారు వేలం వెర్రిగా కొని సింగారించుకుంటున్నారు.

ఏదైనా పండుగ వస్తే, గడపలకూ ద్వారబంధాలకూ చక్కగా పసుపు పూసి మధ్య మధ్య కుంకుమ బొట్లు పెట్టే అలవాటు అంతరించింది... ఏనాడో అదంతా డబ్బాలలో వచ్చే రంగులతో పూయవలసిందే. చుక్కలున్నా ఇనామిల్ ఎర్ర చుక్కలే. ఇవి నీళ్లు పోసినా చెరిగిపోవు. ఇంట్లో వారికి పని తగ్గుతుంది. ఈ దురలవాటు గ్రామాలలోకి కూడా వ్యాపించడము మరీ శోచనీయము. ఎంత మంచిరకపు ఇనామిల్ ఐనా పసుపు కుంకుమ అందముతో సరిపోదు - అని వీరికెలా నచ్చ చెప్పడము?

మన జీవితంలో ఇటువంటి అలవాట్లు ఏర్పడడానికి కారణము కొంతవరకు సినీమాల ప్రభావ మనుకుంటాను. వారికి నకిలీ వస్తువులతోనే పని గడుస్తుంది. అసలు పువ్వులైతే వాడిపోతాయి. ప్లాస్టిక్ పువ్వులైతే ఎన్నాళ్ళైనా ఆ పిక్చర్ పూర్తి అయే వరకూ ఉంటాయి. ఇంక కథలో మన ప్రాచీన శిల్ప సౌందర్యాన్ని చూపవలసివస్తే ఎవరో ఒక సినీమా సంస్థగాని లొకేషన్ షూటింగ్‌కు ఖర్చు పెట్టరు. అన్నిటికీ నకిలీలను తయారుచేసి అవి అసలువైనట్లు భ్రమ కలిగిస్తారు మనకు.

మన ప్రజకు విపరీతమైన అపకారము చేసేవి జనవరి 1వ తేదీ లోపుగా వచ్చే, అతి విరివిగా పంచిపెట్టబడేవీ చాలా చౌక ధరలకు అమ్ముడయేవీ ఐన క్యాలండర్ బొమ్మలు. వీనిలో కొట్టవచ్చేటంతటి ధాతు రంగులలో ఉన్న భామల బొమ్మలను చూచి మనవారు ముగ్ధులైపోతారు. కొందరి ఇండ్లలో ఎన్నెన్ని క్యాలెండర్ బొమ్మలో! ఇవన్నీ కూడా వారి ఇంటి అందాన్ని తక్కువ చేస్తున్నాయని వారికి తెలియదు. ఇక పార్వతీ పరమేశ్వరుల బొమ్మలూ, శ్రీకృష్ణుని బొమ్మలూ ఏదో సినిమాలో ఆ పాత్రలను ధరించిన సినీమా తారల బొమ్మలే! ఆ బొమ్మలలో ప్రస్ఫుటంగా కనిపించేది ఆ సినీమా తారయేగాని పార్వతీకాదు, పరమేశ్వరుడూ కాదు, శ్రీకృష్ణుడూ కాదు!

ఇప్పు డిప్పుడు, కొందరు, పదివేల మందిలో ఒకరు, చిత్రకారుడు చిత్రించిన అసలు బొమ్మలతో తమ ఇండ్ల గోడలను అలంకరించు కొంటున్నారు. దేశంలో చిత్రకళా సాధన బాగా ఎక్కువగానే ఉన్నది. కాని, ఉత్తమ చిత్రకారుని బొమ్మలను కొనేది ఎక్కువగా పాశ్చాత్యులు. మన దేశమును చూడడానికి వచ్చిన విదేశీయులు - ఈ విదేశీయుల సహాయంతో స్థాపితమైన కొన్ని వ్యాపార సంస్థల వారు మంచి మంచి బొమ్మలను క్యాలండర్ల లోనూ, డైరీలలోనూ ముద్రిస్తున్నారు. కాని, ఈ మేలురకపు క్యాలండర్‌లు మన వారిలో చాలా తక్కువ మందికి లభిస్తవి. అందుచేత ఉత్తమ చిత్రకళతో వారికి పరిచయము తక్కువ.

చిత్రకళ అంటే జ్ఞాపకము వచ్చింది: నేను జరిపిన కొన్ని చిత్రకళా ప్రదర్శనలకు జనము తండోపతండాలుగా రాకపోయినా, రోజుకు ఒక వేయిమందికి తక్కువ గాకుండా వచ్చేవారు. వీరందరికీ ఒకొక్క బొమ్మని గురించీ కొంచెము వివరంగా చెప్పుతూ, ఆ రేఖాసంపద వల్లగాని, ఆ రంగుల మేళవింపు ద్వారాగాని, ఎంతటి అందము చేకూరినదో వివరిస్తే వారెంతో శ్రద్ధగా వింటారు. ఇటువంటి చిత్రకళా ప్రదర్శనలు ఎన్ని ఐనా అవసరము మనకు. వట్టి ప్రదర్శనేగాక, ఒకొక్క బొమ్మను గురించి శ్రద్ధగా, ఓపికతో, వివరించేవారు కావాలి మనకు.

మన ఇళ్ళల్లో కుర్చీలూ బల్లలూ అలమారాలు ఎంతో అందంగా తయారుచేయించుకోవ చ్చును. ప్రతి ఊరా వడ్రంగులు, మనకు తెలిసిన మంచి తరహా 'ఫర్నిచర్'ను మనము చూపిన మాతృక ప్రకారం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు. వారికి కావలసినది కాస్త ప్రోత్సాహమే.

మా చిన్నతనంలో మాఇంట మంచి కంచు సామగ్రి ఉండేది. నాకు చాలా ఇష్టమైన ఒక మంచినీటి పాత్రకు నేను ''దోసగింజ ఆపుకారా'' అని పేరు పెట్టినట్లు జ్ఞాపకము. ఆ పాత్ర దోసగింజ ఆకారంలో ఉండేది. చక్కగా తోమితే ఎంతో అందంగా ఉండేది. అదిన్నీ, హరివాణము (అసలుమాట ఏమిటో నాకు సరిగా తెలియదు) అనే రాగి పళ్ళెము అందంగా నగిషీచెక్కినది మా ఇంట ఉండేది. చక్కగా తోమిన ఈ హరివాణములో అప్పుడే చెట్టునుండి రాలిన పారిజాతపు పువ్వులను సేకరించి తెచ్చేవారము పిల్లలము మేము. ఆ పళ్ళెములో ఆ పువ్వులు ఎంత అందంగా ఉండేవో ఇప్పటికీ, ఏబది ఏండ్ల తర్వాత, జ్ఞాపకం చేసుకోగలను నేను! ఆ జీవిత విధానమే మారిపోయింది!!

చిన్న పిల్లల విషయంలో వారికి ఆడుకోటానికి ఇచ్చే ఆటవస్తువులతో ప్రారంభిస్తుంది కళాదృష్టి.. అందమైన ''చెన్నపట్నపు లక్కపిడతలు'' లేక ''ఏటి కొప్పాక'' లక్కపిడతలూ ఇటువంటివానికి బదులు, కీ ఇస్తే గిర్రుమని తిరిగే రేకుతో చేసిన మోటార్‌కార్లూ, రైళ్ళూ, ఏరోప్లేన్లూ - ఇలాంటివి ఇచ్చామా ఆ పిల్లల కళాదృష్టిని చిన్న తనమునుంచీ పెడత్రోవను పెట్టిన వారమవుతాము మనము.

ఒకానొక మహమ్మదీయ కుటుంబముతో కొన్ని రోజులు ఉండే అవకాశం లభించింది నాకు. మనకంటే ఎక్కువగా వారు అందాన్ని పాటిస్తారని తెలియవచ్చింది. కుటుంబమంతా మంచి నగిషీతో నేసిన 'దస్తర్‌ఖాన్' అనే తివాసీలాంటి గుడ్డపైన అందమైన పళ్ళాలలో ఆహారమును స్వీకరిస్తారు. వారు వాడే పాత్ర సామగ్రిన్నీ ఎంతో అందంగా ఉంటుంది. తమలపాకులందించే 'పాన్‌దాన్' ఎంతో బాగుంటుంది. అగరువత్తులను పెట్టే 'స్టాండ్'కు కూడా అందమైన నగిషీ, ఆఖరికి గదికి ఒక మూలనున్న-ముసలివారు ఉమియడానికని ఉంచిన-పాత్రకూడా అందంగా ఉంటుంది. ఇక పిల్లలు, పెద్దవారు ధరించే కమీజులు,

షర్వానీలు, దుప్పట్లూలు ఎంత మనోహరంగా ఉంటాయో నేను వర్ణింపలేను. ఈ విషయంలో, వారి వద్దనుంచి మనం నేర్చుకోవలసింది ఎంతైనా ఉన్నది.

లోకులలో సౌందర్య దృష్టిని, రూపముద్వారా, సంగీతముద్వారా సాహిత్యముద్వారా కల్పించిన మహాపుణ్యము శ్రీ రవీంద్రనాథ ఠాకూరుకు చెందినది. ఆయన రచనలలో మాటిమాటికి ఈ సౌందర్యాన్వేషణా, సౌందర్యానుభూతి ప్రస్ఫుట మగుతూంటాయి. ఆయన సందేశాన్ని రెండే రెండు మాటలలో చెప్పాలి అంటే, అవి: రమ్యాలోచనము, రమ్యజీవనము. మన ఆలోచనలు రమ్యంగా ఉండాలి; మన జీవితము రమ్యంగా ఉండాలి.

కాని, రవీంద్రుడు భౌతిక సౌందర్యానికి విశేషమైన స్థానాన్ని ఇచ్చినా మనము ఆ భౌతికపు ఎల్లలను దాటి ముందుకు పోతూ ఒక ఆధ్యాత్మిక సౌందర్యానుభూతిని పొందాలని రవీంద్రుని ఆదేశము. ఆయన అంటారు :

స్వర్గలోకంలో దేవతలు ఆస్వాదించే
అమృతానికి రూపంలేదు; పరిమితి లేదు
ఆ అమృతం ఎక్కడున్నదో తెలుసా?

జలజల ప్రవహించే సెలయేటిలో;
కన్నుల పండువుగా పుష్పించే చెట్లగుంపులో
మీననేత్రల కాటుకకనుల కొలకుల నాట్యమాడే
మందహాసంలో.

ఆ అమృతాన్నే స్వేచ్ఛగా ఆస్వాదించు - అని

ఇలా భౌతికమైన అనుభవం ద్వారా భౌతికాతీతమైన అనుభూతిని పొందమని ఆదేశిస్తారు రవీంద్రుడు.

మరి ఒకచోట ఇలా అంటారు :

సౌందర్యము అనే మహాప్రవాహంపైన
చిరుకెరటాలుగా రేగే రంగుల అందాన్ని
కన్నులారా చూచి ఆనందించు; కాని,
ఆ రంగులను గుప్పిటిలో బంధించాలని
ప్రయత్నించకు!

ఇది చాలా అవసరమైన హెచ్చరిక! పంచేంద్రియముల ద్వారానే గాక ఇంద్రియాతీతమైన సౌందర్యాన్ని అనుభవించడానికి అవకాశమున్నదని రవీంద్రుని ఈ మాటలు వ్యక్తం చేస్తాయి.

కళ్ళూ రెండూ గట్టిగా మూసుకున్న
నా హృదయాంతర హృదయంలో లీలగా
కనుపిస్తుంది; రూపాతీతమైన మహా సౌందర్యము

కాని; ఆ అంతస్తును చేరడానికి ఎంతో సాధన గావాలి. రూపముల ద్వారానే రూపాతీతమైన సౌందర్యాన్ని సాక్షాత్కరింప జేసుకోవడము సౌందర్యాన్వేషకుని ఆశయము. ఈ ఆశయము ఎంతో అనుభవం తర్వాతగాని, ఎంతో యత్నం వల్లగాని సిద్ధించదు. రవీంద్రుడు లలితకళలో

సంగీతానికి కూడా చాలా ప్రాధాన్యం ఇయ్యడము గమనింప తగినది. ఆయన ఒకచోట అంటారు, ఇలా:

లలితకళలలో అతిస్వచ్ఛమైనది సంగీత కళ;
మరి ఏ ఇతర ఆలంబనములేక, సూటిగా,
సౌందర్యానుభూతిని పొందవచ్చు మనము సంగీతముద్వారా - అని

మన సంగీతము దాక్షిణాత్య సంగీతమైనా ఉత్తరాది బాణీ సంగీతమైనా చాలవరకు మాటలలో కట్టుబడి ఉన్నది. మనవారి వట్టి రాగాలాపన సమయాలలో తప్ప ఏ వాద్యమున కీర్తనలుగాని భజనలుగాని వినిపిస్తున్నా ఆకీర్తనల ఆ భజనలలోని మాటలు మనకు స్ఫురిస్తూ ఉంటాయి. పాశ్చాత్య సంగీతమల్లా కాదు. బిథోవెన్ సింఫనీగాని, లిట్చ్ సంగీతరచనలుకాని, షోపా సంగీత రచనగాని మాటల ప్రసక్తి లేకుండా, కేవలము వాద్య సమ్మేళనము ద్వారా మన కెల్లప్పుడు అమితమైన ఆనందానుభూతి కలిగింపగలవు. ఆ సంగీతము ద్వారా అందమైన చిత్తరువులను చిత్రిస్తారు వారు మన మనోనేత్రము ముందు. పాశ్చాత్య క్లాసికల్ మ్యూజిక్ ద్వారా మనము పొందగల సౌందర్యానుభూతికి పరిమితి లేదు. ఒక జీవితకాలము వినినా ఇంకా మిగిలిపోయే సంగీత రచనలు రికార్డ్ ఐ ఉన్నాయి. ఇంగ్లండ్ , జర్మనీ, పోలెండ్ , రష్యా దేశపు సంగీత ప్రవీణులు రికార్డ్ చేసినవి. ఇవన్నీ మన నిత్య జీవితాన్ని ఎంతో ఆనందపూరితంగా చేయకలవు.

ఈనాడు మనలో ఏదో ఒక పేరిట మూఢవిశ్వాసాలు ప్రబలి ఉన్నా, పండుగా పబ్బమూ వచ్చిన సమయాలలో ఇంకా మన లోగిళ్ళు సౌందర్య చిహ్నములతో కళకళల్లాడుతూ ఉంటాయి... నవనాగరికత ఎంతగా వ్యాపించి ఉన్నా, పేరంటం సమయాన మనవారి నిత్యజీవితంలో సౌందర్యం ఎంత గొప్పగా తాండవిస్తుందో మనం గమనించవచ్చు. ఇట్టి జీవిత ధోరణి హేతువాదానికీ అందమైన ఆధారాలకీ ఏమీ సంబంధం లేదు. పూర్తిగా హేతువాదులమైనా, మన నిత్యజీవితంలో సౌందర్యాన్ని ఈరీతిగా పాటింప వచ్చును.

ఇందాక ఒక చోట, ప్లాస్టిక్ బల్లగుడ్డలను గురించి చెప్పాను. ఇందులో చూపిన బందరు (మచిలీపట్టణపు) జలతారు కుట్టు పనితో కూడిన ఒక దుప్పట్టా చూపడమైనది. మనవారి సౌందర్య దృష్టి ఎంత గొప్పదో ఈ బొమ్మద్వారా తెలుసుకోవచ్చును. ఇటువంటి వానిని విడిచిపెట్టి కేవలము అనుకరణలైన నకిలీ సుందర దృశ్యములతో నిండి మెషీన్ల ద్వారా తయారైన ప్లాస్టికు వస్తువులకు ఎగపడడమంత అవివేకమునకు మనము లోను గాకూడదు.

ఈ వ్యాసము రవీంద్రుని మాటలతోనే పూర్తి చేయడము సమంజస మనిపిస్తోంది. ఆ మహా సౌందర్య వేత్త, ఉత్తమ జ్ఞాని, ఇలా అంటారు. పరమ ఋషి వాక్యంగా:

లోకము భయంకరమైన సంక్షోభములను కలిగించే
పెనుతుఫానులకు పుట్టినిల్లు - కాని, తుఫానుల తీవ్రతను
నాశనము చేసి పరమశాంతిని - నెలకొల్పుతుంది, సౌందర్యము
అనే విశ్వగానము!

మన నిత్య జీవితములో ఈ విశ్వగానము వినిపిస్తూనే ఉంటుంది. మనము వింటూ, ధన్య జీవులము కావాలి. అంతే!

(''కళ'' సౌజన్యంతో).

# బెర్ట్రాండ్ రసెల్ భవిష్యద్దర్శనం

- అబ్బూరి ఛాయాదేవి

''వ్యవస్థలు వ్యక్తిత్వాన్ని రూపొందిస్తాయి, వ్యక్తిత్వం వ్యవస్థల్లో మార్పు తెస్తుంది. ఈ రెండు సంస్కరణలూ జంటగా సాగాలి'' అన్నారు ప్రపంచ విఖ్యాత తత్వవేత్త బెర్ట్రాండ్ రసెల్ తమ స్వీయచరిత్ర చరమాధ్యాయంలో. ''ఒక నిజాన్ని చేరుకునే విధానాన్ని నేను సరిగా ఊహించి ఉండకపోవచ్చు, కాని అటువంటిదొకటి ఉంటుందని నేను అనుకోవడంలో తప్పులేదు, ఆ నిజానికి మనం కట్టుబడి ఉండటం అవసరం. స్వేచ్ఛగా, సుఖంగా ఉండే మానవాళితో నిండిన ప్రపంచాన్ని సాధించే మార్గం నేననుకున్నంత దగ్గరలో లేకపోవచ్చు, కానీ, అటువంటి ప్రపంచం సాధ్యం అనుకోవడంలో నేను పొరపడటం లేదు. అంతేకాదు, అటువంటి దాన్ని చేరుకోవడం కోసం జీవించడం ప్రయోజనకరం...'' అన్నారు రసెల్ తమ స్వీయచరిత్ర ముగింపులో **(V.3. 1969)**.

వ్యక్తిగతంగానూ, సాంఘికంగానూ కూడా తమ అభిరుచులకూ, ఆదర్శాలకూ అనుగుణంగా జీవించారు రసెల్. వ్యక్తిగతంగా సౌందర్యారాధకుడు, సౌమ్యుడు, సున్నిత మనస్కుడు. జీవితంలో ఎదురయ్యే 'అల్ప' విషయాలూ, సంఘటనల పట్ల కూడా వివేకవంతమైన దృక్పథాన్ని అలవరచుకున్న మేధావి. సాంఘిక వాస్తవికతకూ, మానవ మనస్తత్వానికీ ప్రాధాన్యం ఇచ్చిన తత్వవేత్త.

ద్వేషం, అసూయా, అత్యాశా పెరిగే అవకాశం లేకుండా వ్యక్తులందరూ స్వేచ్ఛగా పెరిగే సమాజాన్ని రూపొందించాలని ఊహించేవారు. అటువంటి ఊహాబలంతోనే, ప్రపంచంలో ఎన్ని ఘోరాలు జరుగుతున్నా తాము చెక్కుచెదరలేదని చెప్పుకున్నారు రసెల్.

1959లో లండన్‌లో బి.బి.సి.కి ఇచ్చిన ఇంటర్వ్యూలో బెర్ట్రాండ్ రసెల్ తమ జీవితానుభవాలనూ, అభిప్రాయాలనూ సుస్పష్టం చేశారు. (ఈ ఇంటర్వ్యూ తరువాత ''బెర్ట్రాండ్ రసెల్ స్పీక్స్ హిజ్ మైండ్ '' అనే గ్రంథంగా వెలువడింది). రసెల్ యౌవనంలో కన్న వృద్ధాప్యంలోనే ఎక్కువ సుఖంగా గడిపినట్లు తెలిపారు.

యౌవనదశలో తనకు స్నేహితులు లేరనీ తనతో మాట్లాడేవారెవరూ లేరనీ, ఎన్నోసార్లు ఆత్మహత్య చేసుకోవాలనీ అనిపించేదిట. కానీ, అది చాలావరకు భ్రమ అని తరువాత క్రమంగా తెలుసుకున్నారుట. మనిషి సుఖంగా ఉండాలంటే కావలిసినవి ఆరోగ్యం, ఆత్మీయతతో కూడిన స్నేహసంబంధాలూ, బ్రతకడానికి సరిపడా డబ్బూ, చేతినిండా పనీ... అని రసెల్ అభిప్రాయం. ప్రతిదానికీ వ్యాకులపడటం ఆనందానికి అవరోధం. అందుచేత, భవిష్యత్తు ఇంతకన్న మెరుగ్గా ఉంటుందనుకుని, అందుకు తగిన కృషిచేస్తే ఆందోళన తగ్గి ఆనందంగా ఉంటుంది. ఏవైనా అనుకోని సంఘటనలు సంభవిస్తే వాటిని ఎదుర్కోగల ఆత్మస్థైర్యం లేకపోవడం వల్లనే ఆందోళన కలుగుతుంది అంటారు రసెల్.

తను ఉన్న స్థితితో తృప్తిపడకుండా తనకన్న ఉన్నతస్థితిలో ఉన్నవారితో పోల్చుకోవడం

అసూయకీ, జీవితంలో అసంతృప్తికీ కారణం అవుతుందంటూరాయన. అందుచేత ఇంకొకరితో పోటీగా ముందుకు సాగేకన్న, ఎవరంతట వారు ముందుకి సాగడానికి ప్రయత్నించడం, ముందుకి సాగేవారిని వెనక్కి లాగకుండా ఉండటం ముఖ్యం అన్నారు. జీవితంలో విసుగు అనేది లేకుండా ఉండాలంటే, పురుషుడు గాని స్త్రీగాని ఎవరికి గల శక్తిని వారు సార్థకంగా వినియోగించుకోగలగాలి. వివిధ అభిరుచులు ఉన్నట్లయితే విసుగుకు ఆస్కారం ఉండదు. వృద్ధాప్యాన్ని సుఖప్రదంగా గడపడానికి అవి మరింత దోహదం చేస్తాయి. అయితే, మీ అభిరుచులు ఎంతగా వ్యక్తిగత పరిధిని దాటుతాయో, మీ వ్యక్తిగత జీవితం అంతమవుతోందన్న బాధ అంత తక్కువగా ఉంటుంది అంటారు రసెల్.

చిరంజీవిగా సుఖంగా ఉండే మార్గం గురించి వారి అభిప్రాయాన్ని అడిగితే, సమాధానంగా... ''అది వైద్యులను అడగవలసిన విషయం... ఎంతో మంది ఎన్నోరకాల చిట్కాల గురించి ప్రచారం చేస్తూ ఉంటారు... ఫలానా మందు వాడితే జుట్టు నల్లబడుతుందని... అది నాకిష్టం లేదు. ఎందుకంటే, నా జుట్టు ఎంత తెల్లబడితే, నే చెప్పేదాన్ని వినడానికి జనం అంత సిద్ధంగా ఉంటారు'' అని చమత్కరించారు రసెల్

అభివృద్ధికరమైన సామాజిక పరివర్తనా, సామాజిక సంస్కరణా-వ్యవస్థల వల్లనే కాకుండా-వ్యక్తులవల్ల కూడా సాధ్యం అని చెబుతూ, పూర్వం కోపర్నికస్, గెలీలియో, న్యూటన్, డార్విన్ మొదలైన విజ్ఞాన శాస్త్రజ్ఞులు ఏ వ్యవస్థ సహాయమూ లేకుండానే, ఏ యాంత్రిక సదుపాయాలూ లేకుండానే ఎన్నో గొప్ప విషయాలు కనిపెట్టి ప్రపంచ పురోభివృద్ధికి మౌలికంగా దోహదం చేశారని గుర్తుచేశారు రసెల్.

సాంఘిక ప్రయోజనం దృష్ట్యా వ్యక్తికి సాంస్కృతికంగానూ, సాంకేతికంగానూ ఎంతవరకు స్వేచ్ఛ ఉండాలి అన్న ప్రశ్నకు సమాధానంగా, ఇతరులకు నష్టం కలిగించనంతమేరకు 'సృజనాత్మక'మైన విషయాల్లో సంపూర్ణ స్వేచ్ఛ ఉండాలని అభిప్రాయపడ్డారు. తాము అనుకున్నది సాధించడంలో మహామహులు కూడా సామాజికంగానూ, ప్రభుత్వపరంగానూ ఎన్నో అవరోధాలను ఎదుర్కొని ఎన్నో కష్టనష్టాలను అనుభవించవలసి వస్తున్నదన్నారు.

సంఘ శ్రేయస్సు కోసం, ప్రపంచ శ్రేయస్సు కోసం వ్యక్తిస్వాతంత్ర్యానికీ, జాతి స్వాతంత్ర్యానికీ కూడా హద్దులుండాలన్నారు రసెల్. దేశంలోని సహజ సంపదని జాతీయం చెయ్యాలని సామ్యవాదులు చెప్పినట్లుగా, ఆ సహజ సంపదని కొంతవరకు అంతర్జాతీయం చెయ్యాలని కూడా వాదించవలసి వస్తుందనీ, ఉదాహరణకు... చమురు... ఒక చిన్న దేశంలో అపారంగా లభిస్తున్నట్లయితే, ఆ దేశం ఒక్కటే ఆ చమురుపై సర్వహక్కులూ కలిగి ఉండటం అసంగతమనిపిస్తుందని అంటారు రసెల్.

జాతి, మతం, భాష, సిద్ధాంతం మొదలైన విషయాల్లో దురభిమానాన్ని నిరసించారు రసెల్. ప్రపంచంలోని నేటి దుస్థితికీ, శాంతి రహిత వాతావరణానికీ ఇటువంటి దురభిమానాలే కారణాలన్నారు. కల్లోలాలను సృష్టించే దురభిమానాలు పెచ్చుపెరగకుండా ప్రపంచం సుస్థిరంగా ఉండే ఏర్పాట్లు చేయవలసి ఉంటుంది. అది రాజనీతిపై ఆధారపడినటువంటిది. హై-బాంబులు ఉపయోగించే యుద్ధం కనుక సంభవించినట్లయితే ఉత్తర గోళార్ధంలో ఇంచుమించు ప్రతి ఒక్కరూ సమూలంగా నాశనమైపోవడం, దక్షిణ గోళార్ధంలో అణుశక్తి ప్రసరణ వల్ల విస్తార జన మరణం సంభవించడం ఖాయమని రసెల్ హెచ్చరించారు.

ప్రమాదకరమైన ఈ ఆయుధాల పోటీ కొనసాగుతున్నంత వరకూ ప్రపంచయుద్ధం సంభవించ గలదనే భయం ఉండి తీరుతుంది అన్నారు. రసెల్ దృష్టిలో, దాన్ని తొలగించే మార్గం ఒక్కటే... అది, యుద్ధానికి అవశ్యకమైన ముఖ్య ఆయుధాలన్నిటినీ పూర్తిగా గుత్తకు తీసుకుని, సంపూర్ణ హక్కులు కలిగిన ప్రపంచ ప్రభుత్వాన్ని ఏర్పాటుచెయ్యటమే; అంతే గాక, ఆ ప్రపంచ ప్రభుత్వం కర్తవ్యం- వివిధ దేశాల మధ్యగల తగవులన్నిటినీ పరిశీలించి, వాటికి పరిష్కారాలు ప్రతిపాదించడం, ఆ పరిష్కారాలు అమలు జరిగేటట్లు చూడటం, ఏ దేశమైనా మరో దేశంపై తిరుగుబాటుకు చేసే ప్రయత్నాన్ని విఫలం చేయటానికి తగినంత బలాన్ని సమకూర్చుకోవడం, అణ్వస్త్ర ప్రయోగానికి ఎటువంటి అవకాశం లేకుండా పరిస్థితులను అదుపులో ఉంచడం. దేశంలో ఆంతరంగిక శాంతినీ, క్రమబద్ధతనీ పాటించడా నికి అవసరమైన రక్షక దళాలను మాత్రం అనుమతించడం జరుగుతుంది- అని సూచించారు.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో లభించిన అపారమైన శక్తులవల్ల ప్రపంచానికి ఏర్పడిన ప్రమాదమంతా మానవ మనస్తత్వం మీదే ఆధారపడి ఉందనీ, మనుషుల మనస్సుల్లోని దుష్టమైన రాగద్వేషాలలోనే ఇమిడి ఉందనీ, ఈ విషయాన్ని గ్రహించి, పరమత సహనాన్ని పాటించి, సర్వమానవ సౌఖ్యాన్ని కాంక్షించినట్లయితే, ప్రపంచం ఇంతకుముందెన్నడూ లేనంత సుఖప్రదంగా ఉంటుందనీ రసెల్ విశ్వాసం. ప్రపంచం పూనుకున్నట్లయితే దారి ద్ర్యాన్ని నిర్మూలించగలదు. మానవాళి యావత్తూ ఒకే కుటుంబమని విద్యావిధానంలో నొక్కిచెప్పవలసి ఉంది. పొరుగువారిని ప్రేమించడం అనేది మతాలు ప్రబోధించే నీతి సూత్రంగా మాత్రమే కాకుండా, వ్యక్తిగత సౌఖ్యం కోసం కూడా అది అత్యంత వివేకవంతమైన పద్ధతి అని గట్టిగా బోధించవలసి ఉంది.

## MORAL ANIMAL

"In the 1967 best seller *The Naked Ape*, zoologist Desmond Morris wrote with comforting authority that theevolutionary purpose of human sexuality is "to strengthen the pair-bond and maintain the family unit?'

* * * * *

"It is to a man's evolutionary advantage to sow his seeds far and wide. Women instead seek mates with the best genes and the most to invest in offspring. These strategies can put the sexes in conflict and undermine love."

* * * * *

"Contraceptive technology may also complicate marriage. During human evolution, there were no condoms or birth-control pills. If an adult couple slept together for a year or two and produced no baby."

* * * * *

### WHY DO WOMEN CHEAT?

"Even then the female capacity for promiscuity remained puzzling. For women, more sex doen't mean more offspring. Shouldn't they focus on quality rather than quantity-look for a robust, clever mate whose genes may bode well for the offspring's robustness and cleverness? There's ample evidence that women are drawn to such traits, but in our species genes are not all a male has to offer. Unlike our nearest ape relatives, we are a species of "high male-parental investment". In every known hunter-gatherer culture, marriage is the norm-not necessarily monogamous marriage, and not always lasting marriage, but marriage of some sort; and via this institution, fathers help provide for their children."

**Also wrote: *The Invention and corruption of love*** "Genes don't talk, of course. They affect behavior by creating feelings and thoughts by building and maintaining the brain. Whenever evolutionary psychologists talk about some evolved behavioral tendency-a polygamous or monogamous bent, say, or male parental investment-they are also talking about an underlying mental infrastructure."

# మహాయాన అభివృద్ధి : ముఖ్యధర్మాలు

- ఆచార్య ఎమ్. రాజగోపాలరావు

మహాయానానికి ఆంధ్రదేశం పుట్టినిల్లు. ఆంధ్రదేశం నడిబొడ్డున కృష్ణానది ఒడ్డున ధాన్యకటక, శ్రీపర్వత కేంద్రాలలో అది అభివృద్ధి చెందింది. అది క్రమక్రమంగా దేశ మంతటా విస్తరించి విదేశాలకు గూడా ప్రయాణించి చైనా, జపాన్, కొరియా, టిబెట్, భూటాన్ వంటి దేశాలలో ప్రముఖ మతంగా రూపొందింది. ఈనాడు ప్రపంచంలో ప్రముఖంగా ప్రచారంలోనూ ఆచరణలోనూ ఉన్న బౌద్ధశాఖలలో మహాయానమే ముఖ్యస్థాన మాక్రమిస్తుంది. రెండోస్థానము హీనయానానిది.

అయితే మహాయానము, హీనయానము అనే ఈ శాఖలు బౌద్ధ సంప్రదాయమంగీకరిస్తున్న 18 శాఖలలో కనిపించవు. వాటిలో ఎక్కువభాగము థేరవాదము లేక స్థవిరవాద శాఖలు. మిగిలినవి మహాసంఘికశాఖలు. బౌద్ధంలో మొట్టమొదటి విభజనలో థేరవాదులు మహాసంఘి కులు వేరయిపోయారు. ఈ మహాసంఘికులే మహాయాన మూలపురుషులు. వారు థేరవాదుల దృక్పథాన్ని హీనంగా భావించి వారిని హీనయానులన్నారు. తమ దృక్పథాన్ని ఉన్నతంగా భావించుకొని మహాయానులుగా పరిగణించుకొన్నారు. మహాసంఘికులకు చెందిన పూర్వ శైల, అపరశైల, రాజగిరిక, సిద్ధార్థకులు ధాన్యకటక, శ్రీపర్వత కేంద్రాలలో స్థిరపడి మహా యాన మూలసిద్ధాంతాలను, గ్రంథాలను అభివృద్ధిచేశారు. వారే అంధకులుగా... అంటే ఆనాటి ఆంధ్రులుగా... ప్రసిద్ధిచెందారు. వారి కృషివల్లనే ధాన్యకటక శ్రీపర్వతకేంద్రాలు ప్రపంచమహాయానులకు పవిత్ర యాత్రాస్థలాలయ్యాయి.

మహాయాన అభివృద్ధిలో మహాసంఘికులతోపాటు సర్వాస్తివాదులు గూడా ప్రముఖపాత్ర నిర్వహించారు. సర్వాస్తివాదులు హీనయానానికి చెందినవారు. మహాయానులు ప్రామాణికా లుగా స్వీకరించే జాతకకథలు, లలితవిస్తరము, అవదాన గ్రంథాలు, బుద్ధచరిత మరికొన్ని సూత్రగ్రంథాలు ఆనాడే అభివృద్ధి చెందాయి. సర్వాస్తివాదుల అస్తిత్వ దృక్పథాన్ని విమర్శి స్తూనే వారి విధానాన్ని మహాయానులు వినియోగించుకోవటం గమనిస్తాము. అందువల్లనే మహాయాన అభివృద్ధికి హీనయానం ఎంతో దోహదం చేసిందని పండితులు భావిస్తున్నారు.

కనిష్కుని కాలానికి మహాయాన సూత్రగ్రంథాలు లోకంలోకి వచ్చాయని తారానాథ రాశాడు. బౌద్ధుల నిఘంటువు 'మహావ్యుత్పత్తి' 105 మహాయాన గ్రంథాలను పేర్కొంటు న్నది. వాటిలో తొమ్మిది ముఖ్యగ్రంథాలను నేపాల్ దేశంలో పరమపవిత్ర గ్రంథాలుగా ఆరాధిస్తారు. అవి: 1. అష్టసాహస్రిక ప్రజ్ఞాపారమితము 2. సద్ధర్మపుండరీకము 3. లలితవిస్త రము 4. లంకావతారము 5. సువర్ణప్రభాసము 6. గండవ్యూహము 7. గుహ్యకము 8. సమాధిరాజము 9. దశభూమీశ్వరము. వీటినే నవధర్మాలుగా, ధర్మపర్యాయాలుగా, వైపుల్య సూత్రాలుగా మహాయానులు గౌరవిస్తారు. వాటినే సాధారణంగా మహాయాన సూత్రా లంటారు. అవే మహాయాన దర్శనానికి మతానికీ పునాదులు.

ఇది మహాయాన మొదటి దశ. దానినే 'సూత్రదశ' అంటారు. రెండోది మహాయాన 'శాఖదశ'. అది నాగార్జుననితో ప్రారంభమవుతుంది. నాగార్జునుని వివరణలోనే మహాయాన మొక విశిష్ట దర్శనంగా రూపొందుతుంది. నాగార్జునుని 'మూలమాధ్యమిక కారిక' దీనికి ఆధారము. ప్రజ్ఞాపారమితల సారాన్ని నాగార్జునుడు దీనిలో నిక్షిప్తం చేశాడు. కుహనా భిక్షువులను ఏరివేసి బౌద్ధధర్మాన్ని పునీతం చేసి అన్నిశాఖలకూ నాగార్జునుడే నేత అయాడని తారానాథ ప్రశంసించాడు. నాగార్జునుని దర్శనమే మాధ్యమిక దర్శనము. అది అస్తినాస్తులను ఆక్షేపించి మధ్య ప్రతిపత్తిని ప్రతిపాదిస్తుంది. దానిలో సత్యము 'సంవృతి', 'పరమార్థము' అనే రెండు దశలలో విభాజితమవుతుంది. సంవృతి సత్యమర్థంగానిదే పరమార్థసత్యమర్థం గాదు. పరమార్థసత్యమర్థమయినప్పుడు యథార్థము వ్యావహారికంగా ఉండే అస్తిత్వ అనస్తిత్వ వర్ణనలకు అతీతమవుతుంది. అందువల్లనే అది శూన్యమంటాడు నాగార్జునుడు. ఆ అవగాహన స్థితి నందుకోవటమే నిర్వాణము. ఇది కేవల నిషేధాత్మకత కాదు. అందువల్లనే దానిని 'సాపేక్షవాదం'గా వివరించాడు షెర్‌బాస్కీ. అన్నిరకాల అవగాహనలకు అది అతీతము. సమాధి ద్వారా పొందే మహాప్రజ్ఞకే అది అందుతుంది. ఈ దృక్పథము ఆర్యదేవ, బుద్ధపాలిత, భావవివేక, చంద్రకీర్తి, శాంతిదేవుల వివరణల ద్వారా సుబోధకమవుతుంది.

ఈ దృక్పథంతో విభేదించిన మహాయానులు 'యోగాచారశాఖ'ను అభివృద్ధి చేశారు. దీని మూలగ్రంథము 'యోగాచారభూమి శాస్త్రము'. దీనిని మైత్రేయ నాథుడు రాసినట్లుగా పరిగణిస్తారు. యోగాచరణకు దీనిలో ప్రాధాన్యముంది. అసంగుని 'సూత్రాలంకారము', వసుబంధుని 'విజ్ఞప్తిమాత్రసిద్ధి' దీని ముఖ్యగ్రంథాలు. అసంగుడు 'యోగాచార' మంటే వసుబంధుడు 'విజ్ఞానవాద'మన్నాడు. అది ఆ రెండు పేర్లతోనూ ప్రసిద్ధమయింది. బాహ్యప్రపంచ యథార్థతను తిరస్కరిస్తూ విజ్ఞానాన్ని మాత్రమే వారు యథార్థమంటారు. యోగం ద్వారా దానిని అందుకోవచ్చు. బుద్ధుడు గూడా యోగాచరణ ద్వారానే సంబోధి పొందాడనీ అట్లాగే అందరూ ప్రయత్నించి పది దశలలో (దశభూములలో) పురోగమించి యథార్థం గ్రహించాలంటుంది. జ్ఞానాన్ని ''పరిపక్వత'' (ఊహామాత్రం) 'పరతంత్ర' (ఇతర విషయాల మీద ఆధారపడేది) పరినిష్పన్న (సమ్యక్‌జ్ఞానము)లుగా, విభజించి పరినిష్పన్నస్థాయిలోనే బాహ్యప్రపంచ అయథార్థత 'ప్రజ్ఞప్తిమాత్ర' యథార్థత అర్థమవుతుందని వివరిస్తుంది. స్థిరమతి, దిజ్నగ, ధర్మపాల, ధర్మకీర్తి, శాంతిరక్షితుల ద్వారా ఇది వివరణాత్మకమయింది. ఈ మహాయాన దర్శనాలు ఇతర దేశాలలో మత ప్రాశస్త్యం పొందాయి.

ఇది ఒక ఎత్తు. మహాయానం తీర్చిదిద్దిన మతంగా రూపొందటం మరొక ఎత్తు. దైవం మీది విశ్వాసం మతానికి వెన్నెముక. మహాయానంలో బుద్ధుడు క్రమక్రమంగా దైవంగా రూపొందాడు. అయితే ఇది ఏ ఒక్కనాడో సంభవించిన పరిణామం గాదు. అంధకులు చైత్యాల నారాధించేవారు. అందువల్లనే వారు చైత్యకులయారు. బోధివృక్షాన్ని, ధర్మచక్రాన్ని, సింహాసనాన్ని, భిక్షాపాత్రను, శ్రీపాదాలను బుద్ధుని చిహ్నాలుగా ప్రథమంలో ఆరాధించేవారు. బుద్ధుడు తన ధర్మాన్ని తల్లికి బోధించటానికి తుషిత స్వర్గం వెళ్లినప్పుడు ఎడబాటు భరించలేని ఉదయన చక్రవర్తి చందనం చెక్కతో ప్రతిమను చేయించినట్లు యువాన్‌ఛాంగ్ రాశాడు. బుద్ధుడు మరణించిన 300 సంవత్సరాలకు ఒక అర్హతుడు తన దివ్యశక్తితో ఒక శిల్పిని మూడుసార్లు తుషితస్వర్గానికి తీసుకెళ్లి బోధిసత్త్వ మైత్రేయుని చూపించి 80 అడుగుల ఎత్తున ప్రతిమను చేయించాడనీ దాని పద్మాసనమే ఎనిమిది అడుగుల వెడల్పున్నదనీ

ఫాహియాన్ రాశాడు. ఏమయినా సర్వాస్తివాదుల ఆధ్వర్యంలోనే బుద్ధప్రతిమ అభివృద్ధి చెందింది. అదే క్రమక్రమంగా దైవంగా రూపొందింది. మహాయానులు బుద్ధవిగ్రహాలనభివృద్ధి చేసి ఆరాధించారనీ అమరావతి, మధుర, గాంధార శిల్పకళారీతులు క్రమక్రమంగా అభివృద్ధి చెందాయనీ మనకు తెలుసు. కొన్ని సూత్ర గ్రంథాలు బుద్ధుని సర్వలోక పితగా, ఆద్యంత రహితునిగా, దేవాధిదేవునిగా పేర్కొని స్తోత్రాలనభివృద్ధిచేసి, ధారణులను స్వీకరించి బుద్ధుని, బుద్ధధాతువులను, స్తూపాలను ఆరాధించటమభివృద్ధి చేశాయి. ఈ ధారణులు గూడ ధాన్యకటకంలో అభివృద్ధి చెందాయనీ అందువల్లనే అది 'ధారణీకటకమయి' చివరికి 'ధరణికోట'గా మిగిలిపోయిందనీ భావిస్తున్నారు. ఈ దృక్పథానికి 'సద్ధర్మపుండరీక' కాణాచి. బుద్ధుని భక్తి ద్వారా, సద్ధర్మపుండరీక గ్రంథ ఆరాధన ద్వారా, శరీరాంగాలను, శరీరాన్నీ, సర్వస్వాన్నీ బుద్ధునికి సమర్పించుకోవటం ద్వారా నిర్వాణం పొందటాన్ని అది బోధిస్తుంది. బుద్ధుడు అనంతకోటి అవతారాలెత్తుతాడనీ అతడే నారాయణుడు, బ్రహ్మ, ఇంద్ర, శివ, కుబేర మొదలయిన జన్మలెత్తాడనీ వివరిస్తుంది. ఈ గ్రంథమే చైనా, జపాన్ వంటి దేశాలలో పరమపవిత్రమయి పూజలందుకొంటూ ఉంది. ఇది క్రీ.శ. ఒకటో శతాబ్దాంతానికే ఈ రూపంలో ఉన్నట్లు సాక్ష్యాధారాల ద్వారా పండితులు నిరూపించారు.

ఆ విధంగా క్రమక్రమంగా మహాయానమొక తీర్చిదిద్దిన మతంగా అభివృద్ధి చెందింది. అయితే ఈ పరిణామంలో నాగార్జునుని పాత్రేమిటి అనే విషయం సందిగ్ధంగానే ఉంది. నాగార్జునుడు 'తార'ను ఆరాధిస్తూ స్తోత్రగ్రంథాలు రాశాడని కొందరంటుంటే అవి నాగార్జునునివి కావనీ నాగార్జునుడుప్రసిద్ధుడుగావటం వల్ల వాటిని ఆయనకు ఆరోపించారనీ కొందరంటున్నారు. ఏమయినా మహాయానం విదేశాలకు చేరేటప్పటికే మతలక్షణాలు సంతరించుకొన్నదనటంలో సందేహం లేదు. అది ఇతర దేశాలలో స్థిరపడిన తరువాత ఆయాదేశాల మతాల స్వరూపస్వభావాలను కొంతవరకు లీనం జేసుకొని మరింత ధృఢపడింది.

మొత్తం మీద మహాయానం కొన్ని విశిష్ట ధర్మాలను సమకూర్చుకొంది. వాటిని తులనాత్మకంగా- హీనయానంతో పోల్చి... పరిశీలించటం ద్వారా తేలికగా గ్రహించవచ్చు.

1. హీనయానం బుద్ధవచనానికి- ముఖ్యంగా పాలీ త్రిపిటకాలకు కట్టుబడుతుంది. అందుకే హీనయానులు 'వ్యక్తవాదులు' అయ్యారు. మహాయానులు వచనం వెనుక ఉన్న బుద్ధ హృదయ అవగాహనకు ప్రాధాన్యమిస్తారు. అందువల్లనే వారు గుప్తవాదులయ్యారు. ఈ అవగాహన వ్యక్తిగతమంటారు. ఎవరికివారు వారి వారి స్థాయిలను బట్టి అర్థం చేసుకొంటారు. అందువల్లనే వారు గుప్తహృదయాన్నందించే సంస్కృత, ప్రాకృత సాహిత్యాన్నంతా స్వీకరిస్తారు.

2. హీనయానులు సనాతన సంప్రదాయాల అనుసరణకే ప్రాధాన్యమిస్తారు. మహాయానులు ఆధునిక దృక్పథంతో అవసరమయినప్పుడు మార్పులను, చేర్పులను అంగీకరిస్తారు.

3. హీనయానంలో బౌద్ధసంఘానికీ, నియమాలకూ (వినయ) ధర్మానికీ భిక్షుక జీవితానికీ ప్రాధాన్యమివ్వటంతో సమాజము, సాంసారిక జీవితము వాటికి అవరోధాలు గనుక వాటి నిరసనం కనిపిస్తుంది. భిక్షుక జీవితానికి ప్రాధాన్యమిస్తూనే గృహస్థులతో సన్నిహితంగా ఉంటూ బౌద్ధాన్ని సామాన్యునికి సన్నిహితం జేయటం మహాయానంలో కనిపిస్తుంది.

అందువల్లనే అది కొన్ని దేశాలకు జాతీయ మతం కాగలిగింది. అయితే ఆచరణలో హీనయానులు గూడా సామాన్యులకు సన్నిహితంగానే ఈనాడుంటున్నారు.

4. ఎవరి నిర్వాణాన్ని వారు సాధించుకోవటమే జీవిత ధ్యేయంగా హీనయానులు భావిస్తారు. దీనిని స్వార్థంగా భావించటం వల్లనే మహాయానులు వారిది హీనయానమన్నారు. మహాయానం ప్రకారం బుద్ధుడు నిర్వాణం పొందగలిగినా సర్వజీవులకూ నిర్వాణం సాధించి పెట్టే ప్రయత్నంలో ఎన్నోసార్లు బోధిసత్త్వుడుగా జన్మించి తన జీవితాలనే ఇతరులకు సమర్పించుకొన్నాడనీ అటువంటి సేవాభావమే బౌద్ధులందరికీ ఆదర్శం కావాలనీ మహాయానులు వివరిస్తారు. వారి అధీనంలో ధర్మశాలలు, వైద్యశాలలు, దీనరక్షణ వంటి వాటికి ప్రాధాన్యమిచ్చే కార్యక్రమాలు నడుస్తుంటాయి.

5. హీనయానులు బుద్ధుని ఒక మహోన్నత వ్యక్తిగా చారిత్రక పురుషునిగా స్వీకరిస్తారు. బుద్ధుని ఆద్యంతాలు లేని అనంత శక్తిగా, లోకపితగా, దేవాధి దేవునిగా, సర్వజీవ నిర్వాణప్రధాతగా మహాయానులు స్వీకరిస్తారు. దీనిని అనుసరించే మహాయానంలో త్రికాయ సిద్ధాంతం వచ్చింది. దీని ప్రకారం బుద్ధునికి మూడురకాల శరీరాలుంటాయి. నిర్మాణకాయము, సంభోగకాయము, ధర్మకాయము. దానితో ఆది బుద్ధభావం వచ్చింది. బోధిసత్త్వభావం కొత్తరూపం పొందింది. బోధిసత్త్వుడు తథాగతజ్ఞానం (యథార్థజ్ఞానం) పొందేవరకూ అనంత జన్మలెత్తుతూ ఇతరుల నిర్వాణానికి పాటుపడుతూ ఉంటాడు.

6. దుఃఖమే హీనయానులకు సత్యము. దాని నుంచి బయట బడటమే నిర్వాణము. ఆ మార్గమే వారి అష్టాంగ మార్గము. దుఃఖాన్నే సత్యంగా మహాయానమంగీకరించదు. దుఃఖాన్నీ బాధలనూ సంతోషంగా స్వీకరించటానికీ ఇతరులకు నిర్వాణం ప్రాప్తింపజేయటానికి ఎన్నిబాధలనయినా సహించటానికీ అవసరమయితే ఆత్మత్యాగానికీ మహాయాన బోధిసత్త్వుడు సిద్ధమవుతాడు.

7. హీనయానుల ప్రపంచము పరిమితము. దీనినంతటినీ పంచస్కంధాలుగా విభజించి, వాటిని మళ్లీ ధాతువులుగా వేర్పరిచి, అవి క్షణక్షణమూ మారటం ద్వారా స్థిరరూపాలేవీ లేని శూన్యం మిగులుతుందని (యథార్థాన్ని అర్థం జేసుకొంటే) వారు వివరిస్తారు. మహాయానుల ప్రపంచము చాల విస్తృతము. అది ఆద్యంతాలు లేని అనంతము. దానికంతటికీ ఒక అతీత సత్యము మూలము. ఆ మూలమే బోధిచిత్తము. అది అందుకోవటమే నిర్వాణము.

ఈ విధంగా మహాయానము మహోన్నతమయిన దర్శనాన్ని లీనం చేసుకున్న మహామత వ్యవస్థగా రూపొందింది. బుద్ధుని గుప్తభావాలను సామాన్యులకు అందించే సాహసంతో బయలుదేరిన మహాయానము నిగూఢమయిన తాత్త్విక యథార్థ ప్రతిపాదనలతో సామాన్యావగాహనను తల్లక్రిందులు జేసి సర్వశూన్యతను సాక్షాత్కరింపజేసే యోగాచారపరాయణత్వాన్ని ప్రేరేపించే అతీతయత్నంగా పరాకాష్ఠ చెందింది. బుద్ధుడు నిరసించిన మతము, మతాచారాలు మరోరూపంలో బుద్ధుని చుట్టూచేరి బుద్ధుని దైవంగా రూపొందించాయి. అదే మళ్ళీ సామాన్యునికి అండ అయింది. అదే కాలవైపరీత్యము.

# వ్యక్తిత్వవికాసం (గ్రంథం నుండి)
# మీ మనస్సుకు, మీ ప్రవర్తనకూ మధ్య బిడియపు నీలితెరలు

– సి. నరసింహారావు

మన భారతీయ సమాజం అనేక కులాలు, మతాలుగా చీలిపోయి ఉంది. అంతేకాదు. విభిన్న భాషలు, విభిన్న ఆచారాలు ఇక్కడ చెలామణీ అవుతున్నాయి. ఇవన్నీ కూడా, ఇక్కడి వ్యక్తులపై, అనేక నిర్బంధాలు విధిస్తున్నాయి. ''పై కులాలవారితో క్రింది కులాలవారు సమానం కాదు; సరిరారు. ఇతర మతాల వారితో ఎటువంటి క్రియాశీలక సంబంధాలు నెలకొల్పుకోరాదు. పెద్దల మాటలకు, ఎదురు చెప్పకూడదు. తమ జీవిత సహచరులను తామే ఎన్నుకోకూడదు. పదిమందిలోను మంచివాడని పేరు తెచ్చుకోవాలి'' ఇటువంటి నిర్బంధాలన్నీ మన యువకులపై విధించుతూ; మన సమాజం వారి స్వేచ్ఛను హరిస్తోంది. ఆ కారణం చేతనే, మన యువతీయువకులలో అత్యధిక శాతం మంది బిడియానికి లోనవుతున్నారు. ఇలా బిడియానికి లోనవుతున్నామనిగాని తమ జీవితమంతా ఆ బిడియపు లక్షణాలను ప్రదర్శిస్తున్నామని గాని, క్రమపద్ధతిలో ప్రయత్నించితే ఈ బిడియాన్ని వైదొలగించుకోవచ్చునని కాని, మనలో చాలామంది గుర్తించలేకపోతున్నారు. అందుకే ముందుగా బిడియాన్ని గురించి విపులంగా చర్చిస్తున్నాను. మీరు ఉన్నతంగా ఎదగాలంటే, మున్ముందుగా మీలో బిడియపు లక్షణాలు ఏ స్థాయిలో ఉన్నాయో గుర్తించాలి. తరువాత, ముందు ముందు సూచించే రీతిలో వాటిని వైదొలగించుకోవడానికి ప్రయత్నించాలి.

## మీ మనస్సుకు, మీ ప్రవర్తనకూ మధ్య బిడియపు నీలితెరలు

బిడియపు లక్షణాలు మనం ఊహించనంతటి తీవ్రతరంగా ఉంటాయి. బిడియం కారణంగా మనం క్రొత్త వ్యక్తులను కలవడం అసాధ్యమవుతుంది. ఎవ్వరితోను గాఢమైన స్నేహానుబంధాన్ని నెలకొల్పుకోలేము. అలాగే మనకున్న హక్కుల్ని వినియోగించుకోలేము. అభిప్రాయాలను పైకి చెప్పలేము. మీరు బిడియానికి లోనయినప్పుడు, ఇతరులు మిమ్మల్ని సవ్యంగా అంచనా వేయలేరు. నిరంతరం మిమ్మల్ని గురించి మీరు మథనపడటం జరుగుతుంటుంది. స్పష్టంగా ఆలోచించడాన్ని, మన మనస్సులోని భావాలను సవ్యంగా వ్యక్తం చేయడాన్ని, బిడియం నిరోధిస్తుంది. అంతేకాదు. బిడియంతో వేధించబడే వ్యక్తులు తీవ్రమైన ఆందోళనకు, భయంకరమైన ఒంటరితనపు భావనకు సైతం లోనుకావడం జరుగుతుంది.

మీరు క్రొత్తవారితో ఎటువంటి సంకోచమూ లేకుండా సంభాషణను ప్రారంభించగలరా? మీరు యువకులయితే ఒక యువతితో, మీరు యువతి అయితే ఒక యువకునితో స్వేచ్ఛగా సంభాషించగలరా? అలాగే ఒకసారి సంభాషణ ప్రారంభమయితే దాన్ని పొడిగించగలరా? అలాగే పదిమంది మధ్యకు వెనుకాడకుండా వెళ్ళగలరా? బిడియంతో బాధింపబడే వ్యక్తులకు ఇలా క్రొత్తవారి మధ్యకు వెళ్ళాలంటే, వారి గుండె వేగంగా కొట్టుకొంటుంది. చెమటల్లు పడతాయి... కొద్దిగా చేతులు వణకుతాయి. కడుపులో దేవినట్లు అనిపిస్తుంది. తీవ్రమైన

ఆందోళన చోటుచేసుకుంటుంది. ఎందుకిలా జరుగుతుంది? ఎదుటివారు తమను సరిగ్గా అర్థం చేసుకోరేమోనని, తమ అసమర్థతను వారు తేలిగ్గా పసిగట్టేసి, తమను అవమానించుతారేమోనని, తమ పట్ల అయిష్టత కనపరచుతారేమోనని, తమను తిరస్కరిస్తారేమోనని ఈ బిడియస్థులు భయపడుతుంటారు.

## బిడియం ఎవరికి వారు తనపై విధించుకొనే శాపం!

బిడియానికి లోనైన వ్యక్తులు, తమను చిరునవ్వుతో పలుకరించే సన్నిహితమైన వారితో సైతం, సంభాషించడానికి వెనుకాడతారు. అలాగే పదిమంది క్రొత్త వ్యక్తుల మధ్యకు వెళ్ళడానికి సంకోచిస్తారు. క్రొత్తవారి మధ్యకు వెళ్ళే సమయంలో, ఓ క్షణకాలం పాటు ఎదురయ్యే ఇబ్బందిని గురించే వీరు అధికంగా మథనపడిపోతుంటారు. అంతే తప్ప ఇతరులను కలసినప్పుడు, అంతా సవ్యంగానే ఉండబోతుందని, వీరు ఆశించరు. ఇలా ఆశించలేని కారణంగా, వీరు క్రొత్తవారిని కలవడానికి సాహసించరు. ఫలితంగా వీరి బిడియం దినదిన ప్రవర్థమానమవుతుంది.

ఆత్మవిశ్వాసం లేకపోవడం, ఇతరులతో ఎలా వ్యవహరించాలో అవగాహన చేసుకోలేని కారణంగా, చాలమంది, జీవితాంతం బిడియస్థులుగానే మిగిలిపోతారు. కాని కొద్దిమంది మాత్రం, ఈ బిడియాన్ని, తమంతట తామే అధిగమించగలుగుతారు. ఈ బిడియం ఇలాగే ఉంటే, తాము జీవితంలో ఏమీ సాధించలేమని, వీరు గుర్తించుతారు. పరిచయంలేని వ్యక్తులను ఎక్కువగా కలవడం, అలా కలసినప్పుడు ఏం జరిగినా, ఎన్ని అవమానాలు, చీదరింపులు ఎదురైనా, ఎదుర్కోవడానికి సంసిద్ధులు అయ్యే వారు, అలాగే కేవలం తమ ప్రవర్తన, చొరవవలన మాత్రమే, ఇతరుల అభినందనలు పొందడం సాధ్యమవుతుందని గుర్తింగలిగిన వారు- అతి త్వరలోనే ఈ బిడియాన్నుండి బయటపడగలుగుతారు.

కాని అసలిటువంటి ప్రయత్నాలే చేయని వ్యక్తులు, మరింతగా ముడుచుకుపోతారు. తోటివారినే పలుకరించలేరు. ఒంటరితనానికి లోనవుతారు. క్రమంగా అతి సన్నిహితులకు కూడా దూరమవుతూ, నిత్యం, ఏవో పగటి కలలలో, తమను తాము అద్భుతంగా చిత్రించుకొనే అభూతకల్పనలలో, మునిగి తేలుతుంటారు. ఈ పరిస్థితి మానసిక ఆరోగ్యానికి ఏమాత్రం మంచిదికాదు. తాము ఊహించుకొనే పగటికలలకు, వాస్తవానికి, ఏమాత్రం సంబంధం లేకపోవడంతో- వారి జీవితం మరింతటి నిస్సారమవుతుంది. క్రమంగా తీవ్రమైన నిస్పృహ అలుముకొంటుంది. ఈ పరిస్థితిలో వారు ఎటువంటి నిర్ణయాలు గైకొన్నా, ఆశ్చర్యపోవలసిందేమీ ఉండదు.

మీలో, బిడియం ఎంతటి బలీయంగా ఉన్నా, మీరు దానిని అధిగమించవచ్చు. ఇలా అధిగమించాలంటే, దానిని సవ్యంగా గుర్తించి, అధిగమించే పద్ధతులను మీరు చేపట్టాలి. దాని పునాదులను ఛేదించాలి.

అసలు మిమ్మల్ని మీరు బిడియస్థులుగా పరిగణిస్తారా? అలా పరిగణించినట్లయితే, మీ జీవితంలో, బిడియానికి లోనైన సందర్భాలు ఏమిటి? మీరు బిడియస్థులైతే, ఏ సన్నివేశాలలో, మీరు, అధికంగా బిడియానికి లోనవుతుంటారో, ఏయే ఆలోచనలు, పనులు, మిమ్మల్ని బిడియానికి లోను చేస్తాయో, మీరు మీ నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. అలాగే ఏయే సందర్భాలలో, ఏయే వ్యక్తులతో, మీరెటువంటి బిడియపు భావనకు లోను కారో కూడా, నోట్‌బుక్‌లో

గుర్తించండి. మీ సన్నిహిత మిత్రులలో, బంధువులలో కనిపించే బిడియాన్ని గుర్తించడానికి ప్రయత్నించండి.

## ఎవరైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా బిడియపు వాత పడవచ్చు!

జీవితంలో, ఇంతవరకూ బిడియానికి లోనుకాని వ్యక్తులు సైతం ఏదో ఒక సన్నివేశంలో, అకస్మాత్తుగా బిడియపు వాతపడవచ్చు. అలాగే చిన్నపిల్లలు, యువతులే, సిగ్గుసిగ్గుగా ప్రవర్తిస్తారని అనుకోవడానికి వీల్లేదు. యువతులకంటే యువకులే అధికంగా బిడియాన్ని కనపరచుతుంటారు. అలాగే వయస్సు వచ్చినవారు, జీవితంలో స్థిరపడినవారు, ఎటువంటి ఆర్థిక సమస్యలు, బాదరబందీ లేనివారు సైతం బిడియపు ప్రవర్తనను కనపరచవచ్చు. ఎవరు, ఎప్పుడు, బిడియానికి లోనైనా, దాన్ని వదిలించుకోవడం అధిగమించడం సాధ్యమే!

బిడియాన్ని, స్పష్టంగా నిర్వచించడం, సులభం కాదు. ఇది అనేక రూపాలలో వ్యక్తమవు తుంటుంది. ఇతరుల ఎదుట, చాల అసౌఖ్యంగా, ఇబ్బందిగా కొందరికి ఉండవచ్చు. మరికొందరికి, ఇది తీవ్రమైన ఆందోళన కలిగించేదిగా, స్తబ్ధుల్ని చేసేదిగా, ఉండవచ్చు. కొంతమందికి, బిడియం తాము ఎంచుకొన్న జీవన విధానం కావచ్చు. మరికొందరికిది, భరించలేని దుర్భర శిక్ష కావచ్చు. కొంతమంది రచయితలు, విజ్ఞానవేత్తలు, ఇతరులతో కలవనవసరంలేని రీతిలో, తమ జీవితాన్ని రూపొందించుకొంటారు. కాని, ఇటువంటి వారిలో కూడా, కొందరు, అవసరం వచ్చినప్పుడు, ఇతరులతో అతి తేలికగా కలసిపోగలరు కూడా. కొందరు, ఎంత అవసరం కల్గినా, ఇతరులతో కలవలేరు. మీరు సైతం ఎంత అవసరం వచ్చినా, ఇతరుల మధ్యకు వెళ్ళని సన్నివేశాలేమయినా ఉన్నాయేమో గురుతు చేసుకుని, మీ నోట్‌బుక్‌లో గుర్తించండి.

## పోసుకోలు రాయుళ్ళు, పొగరుబోతులు, గంభీరమైనవారు కూడా బిడియస్తులే!

అలాగే, కొందరు వ్యక్తులు, తమ బిడియాన్ని మరో విధంగా వ్యక్తీకరిస్తారు. వీరు, ఇతరులు చెప్పేది వినకుండా, గంటల తరబడి సోది చెప్పడం, ఇతరులను అవమానించి వినోదించడం, ఎవరన్నా లెక్కలేనట్టు పొగరుబోతుతనంతో వ్యవహరించడం చేస్తుంటారు. ఇతరులతో మామూలుగా కూర్చుని, సవ్యంగా సంభాషించడానికి భయపడిపోతుండడమే, వీరి విపరీత ప్రవర్తనకు కారణం. ఇటువంటి వ్యక్తులు ఎవరైనా మీకు తెలిస్తే వారి పేర్లను మీ నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. ఇతరులను చూసి భయపడడాన్ని బిడియంగా మనం పరిగణిస్తున్నాము. ఎవరి ప్రవర్తననైనా గమనించి వారి మనస్సులో బిడియం తిష్టవేసుకుందో లేదో మనం చెప్పలేకపో వచ్చు. అందుకే, మిమ్మల్ని మీరు, బిడియస్తులుగా పరిగణించుకొంటుంటే, మీ ప్రవర్తన ఎలావున్నా ఒకటే! మిమ్మల్ని బిడియస్తులుగానే పరిగణించవలసి ఉంటుంది.

ఇటువంటి బిడియస్తులు, గంభీరమైనవారుగా, ఎవరి జోలికీ వెళ్ళనివారుగా, మర్యాదస్తు లుగా, తమనుతాము పరిగణించుకొంటుంటారు. ఇతరులు సైతం తమనలాగే, గుర్తించాలని కోరుకొంటారు. సామాన్యంగా, వీరు, ఇతరులతో పోట్లాటలకు దిగరు. ఇతరుల ఆజ్ఞలను, మౌనంగా పాటిస్తారే తప్ప, తమకేంకావాలో, వీరు పైకి చెప్పలేరు. అలాగే, పదిమంది మధ్యకు వెళ్ళడానికి, వీరు సాహసించరు. ఫలితంగా, వీరిని ఎవ్వరూ గుర్తించరు. అలా గుర్తించ నప్పుడు వీరికి, ఇతరులతో వ్యవహరించవలసిన బాధ తప్పుతుంది.

మీరు బిడియానికి లోనయి, ఏ పనీ చేయలేకపోతుండవచ్చు. కాని, ఈ ఆందోళన మీ ఒక్కరికే పరిమితం కాదు. ఈ ప్రపంచంలో అత్యధికులు, ఈ బిడియపు లక్షణాలు ఏవో కొన్ని, కనపరచుతూనే ఉంటారు. వీరు ఈ బిడియపు లక్షణాలను వివిధ రూపాలలో, కనపరచుతుంటారు. వీరిలో అత్యధికులు ప్రసంగించడానికి జంకుతుంటారు. అలా ప్రసంగించవలసి వచ్చినప్పుడు కూడా, తాము చెప్పదలచుకొన్నది చెప్పలేక పోయామంటారు. అలాగే, ఎదుటివారి కళ్ళల్లోకి సూటిగా చూడలేరు. తమకు పరిచయం లేని వ్యక్తులను కలవవలసి వచ్చినప్పుడు, తప్పనిసరిగా, వారిని తప్పించుకు తిరుగుతారు. తప్పించుకోవడానికి వీలులేనప్పుడు, పదిమంది మధ్యకు వెళ్ళినా, నిశ్శబ్దంగా ఉండిపోతారు. ఎవరైనా పలుకరించబోతే, స్పష్టమైన సమాధానం చెప్పకుండా, పేలవంగా నవ్వుతూ, తమలోతాము, ఏదో గొణుక్కుంటున్నట్లు మాట్లాడతారు.

## బిడియం, బిడియాన్ని వృద్ధిచేస్తుంది

వీరు, తమను తాము, సవ్యంగా వ్యక్తం చేసుకోలేరు. ఫలితంగా, తాము కోరిన రీతిలో తమ జీవితాన్ని రూపొందించుకోలేరు. జీవితంలో, మనం ఏం పొందాలన్నా, ఇతరులతో, నిరంతరం లావాదేవీలు జరుపుతుండాలి. చేసేది వ్యాపారమైనా, ఉద్యోగమైనా వృత్తి అయినా, ఇది తప్పదు. వీటిని సక్రమంగా జరుపలేనప్పుడు, వీరు, జీవనపోరాటంలో విజయం సాధించలేరు.

కొత్త వ్యక్తులను కలవవలసి వచ్చినప్పుడు, ఏం జరుగుతుందోనన్న ఆదుర్దాతో, చెమట పట్టడం, గుండె వేగంగా కొట్టుకోవడం, చేతులు వణకడం జరగవచ్చు. బిడియస్తులు, ఈ లక్షణాలనే అత్యధికంగా పట్టించుకొంటారు. వెన్వెంటనే, తాము వారిని కలవలేమని, కలవడం అనవసరమని నిర్ణయించుకొంటారు. తమ లోపాలను గుర్తించకుండా, వాటిని సరిదిద్దుకోవడానికి ప్రయత్నించకుండా, అసలా లోపాలు బహిర్గతమయ్యే సన్నివేశమే ఏర్పడకూడదని వీరనుకొంటుంటారు.

బిడియానికి లోనైన వ్యక్తులు, అసలు ఇబ్బందికరమైన ఆలోచనలకు, తమ మనస్సులో చోటివ్వరు. తమకిష్టంలేని పనులను గురించి ఆలోచించరు. తమను తాము, అతి తక్కువగా, అంచనా వేసుకొంటారు. నిరంతరం, తమను గురించి తాము మథనపడిపోతుంటారు. ఇతరులు తమను గురించి ఏమనుకొంటున్నారు? తమపట్లవారిలో ఎటువంటి అభిప్రాయం కలిగించాము? వారు తామంటే ఇష్టపడుతున్నారా? వాళ్ళు తామంటే ఇష్టపడేటట్లు చేయడమెలా? మీరు కొత్త వ్యక్తులను కలసినప్పుడు మీ మనస్సులో, ఈ ప్రశ్నలు కులుగుతాయో లేదో, మీరు నోట్‌బుక్‌లో వ్రాసుకోండి. అలాగే అసమర్థుడనని, ఇతరులకంటే తక్కువవాడినని, తెలివితక్కువ వాడినని, అనాకారినని మిమ్మల్ని గురించి మీరు అనుకుంటుంటారా? అలా అనుకొంటుంటే ఆ విషయం కూడా మీ నోట్‌బుక్‌లో వ్రాయండి.

ఇతరులతో సవ్యంగా ప్రవర్తించలేనని, వారు తనను ఎలా అంచనా వేస్తారోనని భయపడే వ్యక్తి, కేవలం ఈ భయాల కారణంగా సవ్యంగా ప్రవర్తించలేకపోవచ్చు. ఇలా సరిగా ప్రవర్తించనప్పుడు, ఇతరులు సహజంగానే తక్కువగా అంచనావేయడం జరుగుతుంది. అప్పుడిక, తమ భయాలు నిజమయ్యాయనుకొంటూ, న్యూనతాభావనకు లోనుకావడం జరుగుతుంది. ఫలితంగా వీరు తమలో ఉన్న ప్రతిభను సైతం వ్యక్తం చేసుకోలేరు. ఎంతో వృద్ధిలోకి రావలసినవారు కూడా; ఈ బిడియం వలన, ఉన్నచోటే మిగిలిపోవడం జరుగుతుంది.

అవకాశం చిక్కినప్పుడెల్లా, మీరు, మీ కుటుంబ సభ్యులతో కాని, మీ మిత్రులతో కాని బిడియపు లక్షణాలను గురించి, చర్చించండి. అలాగే, మిమ్మల్ని, ఇతరులు బిడియస్థులుగా గుర్తిస్తున్నారో, లేదో, అడిగి తెలుసుకోండి. మీ పరిచయస్థులలో, ఎక్కువగా, ఏయే వ్యక్తులు, బిడియానికి లోనవుతున్నారో గుర్తించండి. క్రొత్త వ్యక్తులు, మేధావులు, అధికార స్థానాల్లో ఉన్నవారు, బంధువులు, ఉన్నత కులానికి చెందినవారు, వీరిలో ఎవరు, మిమ్మల్ని, అధికంగా బిడియానికి లోనుచేస్తున్నారో కూడా, నోట్ బుక్‌లో గుర్తించండి.

ఏదైనా సమావేశానికిగానీ, పార్టీకిగాని వెళ్ళినప్పుడు, మీరు ఒకచోట నిశ్శబ్దంగా కూర్చుంటే, ఏదో జరుగుతుందని అనుకొంటున్నారా? ఇది తప్పు.

## ఎవరో వస్తారు, ఏదో చేస్తారని ఎదురు చూడవద్దు

ఏదో జరుగుతుంది, ఎవరో వచ్చి పలుకరిస్తారని, మీ బిడియం చెల్లాచెదరయ్యేలాగా, అందరూ వచ్చి, మీ చుట్టూ మూగుతారనుకోవడం పొరపాటు. ఇతరులను కలవవచ్చని, ఇలాంటి సమావేశాలకు, చాలామంది వెళతారు. తీరా అక్కడకు వెళ్ళిన తరువాత ఇతరులను పలకరించే చొరవ తీసుకోరు. ఫలితంగా వీరిని సైతం ఎవ్వరూ పలుకరించరు. ఆ తరువాత, సహజంగానే, వీరు నిస్పృహకు లోనుకావడం జరుగుతుంది. ఎవరైనా పలకరించబోయినా, వీరు, ముభావంగా ఉండిపోతారు. ఎన్ని సమావేశాలలో పాల్గొన్నా, వీరిలా నిస్పృహతో మిగిలిపోవడమే తప్ప, చొరవ గైకొనడానికి ప్రయత్నించరు. తామేదో దీర్ఘాలోచనలో పడినట్లు, చుట్టూ జరుగుతున్నవి పట్టించుకోనట్లు, వీరు నటిస్తారు. వేచిచూద్దాం అన్న ఆలోచనే తప్ప ప్రయత్నం చేద్దామన్న భావనే, వీరికి కలగదు.

మీకు సైతం, ఇటువంటి సన్నివేశాలు ఎప్పుడైనా ఎదురయ్యాయేమో, గుర్తుతెచ్చుకోండి. ఇలా ముభావంగా కూర్చోవడం కంటే- ఇతరులతో సంభాషించడమే చాల తేలిక. మిమ్మల్ని మీరు పరిచయం చేసుకోవచ్చు. ఎదుటివారిని చిరునవ్వుతో పలుకరించవచ్చు. వివిధ విషయాలపై వారి అభిప్రాయాలను అడుగవచ్చు. మీ చుట్టూ ముభావంగా ఉన్నవారు సైతం, కేవలం మీలాగానే, సందిగ్ధతతో, సతమతమవుతుండవచ్చని మీరు గుర్తించండి.

ఎవరో కొందరు అదృష్టవంతులు ఉంటారని, వారికి చాలమందితో పరిచయాలు ఉంటాయని, మీరు అటువంటివారు కారని అనుకొంటున్నారా? ఇది తప్పు.

ఇతరులకు అనేక మందితో పరిచయాలు ఉండడం, మీకు లేకపోవడం, అదృష్ట మహిమ ఏమాత్రం కాదు. వారు చొరవ గైకొని ఇతరులతో పరిచయాలు పెంచుకొంటూ, ఏర్పడిన పరిచయాలను పోషించుకొంటూ ఉంటారు. మీరందుకు భిన్నంగా ఉండడం వలన, మీకు అధిక పరిచయాలు లేవు. పరిచయాలను ఏర్పరచుకోవడానికై ఖచ్చితమైన సూత్రాలేమీ లేవు. ఇతరులతో పరిచయాలు పెంపొందించుకోవాలన్న అభిలాష మీకు నిజంగా ఉంటే, అలా పెంపొందించుకొనే అవకాశాన్ని దేన్నీ, జారవిడవకూడదు.

## మీరు చొరవ తీసుకొంటే చాలు
## మీ బిడియం పోగొట్టడానికి అందరూ తోడ్పడుతారు

మీరంటే ఇష్టపడి, ఆకర్షితులయ్యేవారు ఎవ్వరూ లేనంతటివరకూ, మీరే ప్రయత్నం చేసినా ప్రయోజనం ఉండదనుకోవడం పొరపాటు.

మీ వైఫల్యాలన్నింటినీ గుర్తుకుతెచ్చుకొని, ఎదుటివారు మీ పట్ల ఆకర్షితులు కావడం లేదనుకోవడం, తప్పు. మీరు, ఎటువంటి ప్రయత్నమూ చేయకపోవడమే కాకుండా, అలా ప్రయత్నించకపోవడాన్ని సైతం, సమర్థించుకోవడానికి చూస్తున్నారని గుర్తించాలి.

ఎవరైనా, మీ పట్ల, తమ ఇష్టతను స్పష్టంగా పైకి వ్యక్తం చేయకపోతే, వారికి మీరంటే ఇష్టంలేదని, ఏనాటికీ ఇష్టం కలగదని అనుకొంటూరా? ఇది కూడా చాలా తప్పు.

మీరంటే ఇష్టపడే వ్యక్తి ఎంతమందిలోవున్నా, మిమ్మల్ని చూడగానే పరుగున మీ దగ్గరకు వచ్చి, చుట్టూవున్న వాళ్ళందరినీ కాదని మీ పట్ల పూర్తి ఆసక్తి కనబరచాలని, మీరనుకోవచ్చు. ఇలా జరగడం ఎక్కడా సాధ్యపడదు. మీరంటే అభిమానం, ఎదుటివారిలో క్రమంగా ఏర్పడుతుంది. కొద్దిపాటి పరిచయంతో, వారు హృదయం విప్పి, మీతో అన్నీ ఏకరువుపెడ తారనుకోవడం తప్పు. అలాగే, ఎవరైనా చిరునవ్వుతో పలుకరించి ఓ నిముషం పాటు మాట్లాడితే, వారితో మీకు గాఢమైన స్నేహానుబంధం నెలకొన్నదనుకోవడం కూడా తప్పే!

మీరు, ఎవరికైనా సన్నిహితం కాదలచినప్పుడు, ఎదుటివారు కూడా ఆ విషయం గుర్తించుతారని, అందుకై ఎదురుచూస్తారని, అనుకోవడం పొరపాటు.

ఏ రైలులోనో, బస్సులోనో, లేక ఏదైనా సమావేశంలోనో కలసినప్పుడ, మీరు, మరొక వ్యక్తితో, గంటలతరబడి ఎన్నెన్నో విషయాలు, అతిసన్నిహితంగా చర్చించి ఉండవచ్చు. మీ మధ్య ఏర్పడిన ఈ పరిచయాన్ని, మీరు, స్నేహంగా పరిగణిస్తే, మీరు పొరబడ్డారనే పేర్కొనాలి. మీ మధ్య, తప్పక, స్నేహాన్ని పెంచుకోవచ్చు. అందుకు సమయం పడుతుంది. అలాగే, ఈ పరిచయం అక్కడితోనే నిలిచిపోవచ్చు కూడా! మీరందుకు గాభరా పడవలసిన అవసరం లేదు.

మీరు ఎవరికైనా సన్నిహితం కాదలచినప్పుడ, వారు తిరస్కరిస్తే, మిమ్మల్ని వారు విలువలేకుండా తీసిపారవేశారనుకోవడం పొరపాటు.

## తిరస్కార భయం వలన, అన్నిచోట్లా తిరస్కారమే కనిపిస్తుంది

ఇటువంటి ఆలోచనల మూలంగానే, చాలమంది, ఎటువంటి ప్రయత్నమూ చేయ కుండా, నిశ్శబ్దంగా ఉండిపోతారు. ఇతరులంతా మీరంటే ఇష్టపడి, నిరంతరం మీపట్ల ఆకర్షితులు అయితేనే, వారు మీ విలువ గుర్తించినట్లని భావించడం పొరపాటు. ఇతరులు తమను తిరస్కరిస్తారేమోనన్న భయం, ఇతరులతో కలిసే ప్రయత్నాలన్నింటినీ నిరోధి స్తుంది. అలాగే మీరు పలుకరించినప్పుడు, ఎవరైనా పనివుందంటూ వేగంగా వెళ్ళిపోతే, వారికి నిజంగా పని ఉందేమోనన్న అనుమానమే లేకుండా, మిమ్మల్ని తిరస్కరించారని మథనపడడం, పూర్తిగా పొరపాటు. బిడియానికి లోనైన వ్యక్తులు, తమనెవరైనా తిరస్కరించి నట్లు అనుమానించినా, అనాసక్తి చూపారని అనుకొన్నా, తమకున్న అవలక్షణాలన్నిటినీ తలచుకొని, కుమిలిపోవడం జరుగుతుంది. అంతే తప్ప, ఇద్దరు వ్యక్తులు ఒకేలా ప్రవర్తించకపో వచ్చునని, ఒకేలా ఆలోచించక పోవచ్చని, అనుకోరు. ఇలా అనాసక్తి కనపరచడం తాత్కాలిక మేనని, అది ఆ సన్నివేశానికి సంబంధించిందే తప్ప- తమ పట్ల కాదని భావించరు.

పైన చెప్పిన పొరపాటు అభిప్రాయాల్లో, మీరు ఆదరిస్తున్నవి ఏమైనా ఉంటే, వాటిని నోట్‌బుక్‌లో వ్రాయండి.

ఈ ఆధునిక కాలంలో, భిన్న అభిప్రాయాలు, వేర్వేరు ఆసక్తులు ఉన్న వ్యక్తులతో మీకు

పరిచయం ఏర్పడవచ్చు. ఎవరినుండి ఏమి ఆశించాలో, ఏమి ఆశించకూడదో మీరు గుర్తించాలి. మీకు పరిచయం ఉన్న వ్యక్తులనుండి, మీరు, ప్రతిదీ ఆశించడం సబబు కాదు. అలాగే మీరు సైతం, అందరి, అన్ని అవసరాలను, ఎల్లప్పుడూ మన్నించాలనుకోవడం, సరికాదు.

## మంచి స్నేహాలన్నింటికీ పరిమితులు వుంటాయి

ఒకవ్యక్తి మీతో సినిమాలకు, పార్కులకు రావడానికి మాత్రమే అంగీకరించవచ్చు. అతనితో పరిచయం, అంతవరకే పరిమితమని, మీరు గుర్తించాలి. ఇతను, మీకు అవసరమైన ప్పుడు, డబ్బు సాయం చేయకపోవచ్చు. అయినా మీరు నొచ్చుకోవలసిందేమీ లేదు. అలాగే, మీకు అడిగినప్పుడు అప్పిచ్చే వ్యక్తి మరొకరు ఉండవచ్చు. ఇతడు మీరు ఆహ్వానించిన ప్పుడు, సినిమాలకు రాకపోవచ్చు. అలాగే ఒక యువతి, మీతో గంటల తరబడి సంభాషించడా నికి ఇష్టపడవచ్చు. కాని మీతో షికారుకు అంగీకరించకపోవచ్చు. మీరు చనువుతీసుకోవడాన్ని ఆమోదించక పోవచ్చు. ఇలా తిరస్కరించినంత మాత్రాన, వారు, మీ పట్ల అయిష్టత చూపుతున్నారనుకోవడం పొరపాటు. అలాగే, మీరు, ఎవరి అభ్యర్థననైనా తిరస్కరించవలసి వస్తే, వారు మీకు దూరమైపోతారని భయపడడం తప్పు. అలాగే మీకు అప్పివ్వనని ఒకసారి చెప్పిన వ్యక్తి, ప్రతిసారీ, అలాగే చెబుతాడని అనుకోగూడదు. మరోసారి, మీకు అవసరం ఏర్పడినప్పుడు, అతన్ని తిరిగి అడగవచ్చు. మీరు, వ్యక్తుల మధ్య ఉండే ఈ తేడాను, గురుతించడానికి ప్రయత్నించండి. మీకు పరిచయం ఉన్న వ్యక్తులలో, ఎవరు ఎటువంటి వారో, మీ నోట్‌బుక్‌లో వ్రాయండి.

ఎదుటివారు కోరినది మీరు అందించలేకపోతే, అది మీ బలహీనతకు చిహ్నమని, మథనపడవద్దు. ఆరోగ్యవంతులైన మీరు, తన వద్దకు రావడం లేదని, మీకు పరిచయమున్న వైద్యుడు కోపగించుకోడు. మీరు ఒక సినిమాను, ఇంతకుముందే చూసివుంటారు. ఈ కారణంగా, మరోసారి రానని చెబితే, మీ స్నేహితుడు నొచ్చుకోడు. ఇతరులతో వ్యవహరించే టప్పుడు, ఇలా, మీకు అవసరం లేని, ఇష్టంలేని పనులు చేయనక్కరలేదు.

బిడియస్తులు, ఎదుటివారికి, ఏదీ స్పష్టంగా చెప్పలేరు. తమను ఎదుటివారు తృణీకరిస్తా రేమో, తమ అవలక్షణాలను వారు గుర్తించి చీదరించు కొంటారేమోనన్న భయంతో, వీరు తరచుగా ఆందోళనకు లోనుకావడం జరుగుతుంది. ఇలా ఆందోళనకు లోనయినప్పుడు, అప్పటి సన్నివేశానికి తగినట్లు ఆలోచించి, ప్రవర్తించగల స్వేచ్ఛను, వీరు కోల్పోవడం జరుగుతుంది. ఫలితంగా, వీరి మనస్సు ఏవో కొన్ని స్థిరమైన అభిప్రాయాలతో, బిగిసిపో తుంది. ఆ అభిప్రాయాలు సవ్యమైనవో, కావో, పరీక్షించి చూసే అవకాశమే వీరు కోల్పోవడం జరుగుతుంది.

ఇలా ఆందోళనకు, ఒత్తిడికి, లోనయినప్పుడు, తమకు ఖచ్చితంగా తెలిసిన ప్రవర్తనకే అంటిపెట్టుకొంటారు. తామేమీ మాట్లాడకపోతే, ఏమీ చేయకపోతే, తమనెవరూ, తక్కు వగా అంచనా వేసే అవకాశమేర్పడదు. ప్రయత్నించి అభాసుపాలు అయ్యేకంటే, ప్రయత్నించ కపోవడమే మెరుగని, వీరు నిర్ణయించుకొంటారు. ★

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**

Plot No. 337 A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# BRANCH OFFICES

**Synonyms for safe & pleasant places for your savings**

| | Branch | Phone Nos. |
|---|---|---|
| 1. | Vidyanagar | 615192 |
| 2. | Malakpet | 528983 |
| 3. | Narayanaguda | 664909 |
| 4. | Vidyut Soudha | 220378 |
| 5. | Secunderabad | 76172 |
| 6. | Saidabad Colony | 877401 |
| 7. | Boudhanagar | 615518 |
| 8. | Himayatnagar | 232837 |
| 9. | Tarnaka | 869351 |
| 10. | Masab Tank | 225451 |
| 11. | Dilsukhnagar | 875539 |
| 12. | Charminar | 524161 |
| 13. | Baghlingampally | 668944 |
| 14. | Lothukunta | 845527 |
| 15. | Tarnaka Ext. Counter | 869308 |
| 16. | Tirupathi | 22428 |

RATES OF INTEREST ON

## DEPOSITS

| | |
|---|---|
| Current Account | — |
| Savings Account (w.e.f. 1-7-93) | 5.25% |
| **Term Deposits (w.e.f. 1-10-93)** | |
| 46 days o 179 days | 8% |
| 180 days to 364 days | 8.50% |
| One Year & above | 10.25% |

**NRE (Indian Rupee) Accounts**

(w.e.f. 12-10-93)

| | |
|---|---|
| Savings Account | 5% |
| **Term Deposits** | |
| 46 days to 270 days | 11% |
| 271 days to below 1 year | 10.50% |
| One year and above | 11% |




**The Andhra Pradesh State Co-op. Bank Ltd.**
(Scheduled Bank)
Troop Bazar, Hyderabad-500 001.
Phone. 44481-82-83.
Telex 0425-6756, APCB-IN.
Fax. 0091-842-44978.

**APCOB: The Bank extending prompt & courteous service.**